**Hazrath Ali (R)**
**(Telugu)**

ప్రియప్రవక్త (సఅసం) వారి నలుగురు ఆప్త మిత్రులు

**4వ భాగం**

# హజ్రత్ అలి

**(రజి అల్లాహు అన్హు)**

మూలం

**మౌలానా ఇర్ఫాన్ ఖలీలి**

అనువాదం

**అబ్బాదుల్లా**

قَالَ النَّبِيُّ صَلَّى اللهُ عَلَيْهِ وَسَلَّمَ

إِنَّ عَلِيًّا مِنِّيْ وَأَنَا مِنْهُ

(ترمذی)

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రవచించారు:

"నిస్సందేహంగా నేను అలి (రజి) మనిషిని,
అలి (రజి) నా మనిషి" (తిర్మిజి)

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# హజ్రత్ అలి

**(రజి అల్లాహు అన్హు)**

## పేరు - వంశం

దైవప్రవక్త (సఅసం) నిష్క్రమణ తరువాత అయిన ఖలీఫాలలో నాల్గవ ఖలీఫా పేరే హజ్రత్ అలి (రజి). ఆయన ఇతర (కునియత్) పేర్లు అబుల్ హసన్, అబూ తురాబ్. బిరుదు అసదుల్లా. ఆయన నాన్నగారి పేరు అబూతాలిబ్ బిన్ అబ్దుల్ ముత్తలిబ్, అమ్మగారి పేరు హజ్రత్ ఫాతిమా బిన్త్ అసద్ (రజి). ఆయన తండ్రి పెట్టిన అసలు పేరు జైద్. తల్లి పెట్టిన అసలు పేరు హైదర్. అయితే మన ప్రియప్రవక్త (సఅసం) అయనకు అలి అని పేరు పెట్టారు. ఈ పేరుతోనే ఆయన ప్రసిద్ధిచెందారు. దాంతో అసలు పేరు మరుగున పడిపోయింది. హజ్రత్ అలి (రజి) స్వయానా దైవప్రవక్త (సఅసం) పినతండ్రి కొడుకే. వరసకు తమ్ముడవుతారు. ఆయన తల్లిదండ్రులు ఇరువురూ హాషిమ్ వంశస్థులే.

ఖురైష్ తెగలో బనూహాషిం ఎంతో గౌరవప్రదమైన వంశం. కాబాగృహ నిర్వహణ బాధ్యత బనూహాషింకే అప్పగించబడింది. ఈ కారణంగా యావత్తు అరేబియాలో దానికి మత నాయకత్వపు హోదా లభించింది. మొత్తం అరేబియాలో ఆ వంశాన్ని ప్రజలు ఎంతగానో గౌరవిస్తారు. ప్రతి చోటా ఆ వంశం ఎంతో ప్రసిద్ధిచెందింది.

## పుట్టుక - బాల్యం

హజ్రత్ అలి (రజి) ఏనుగులవారి సంఘటనకు దాదాపు ముప్పయి సంవత్సరాల తర్వాత పుట్టారు. అంటే దైవప్రవక్త (సఅసం) కంటే హజ్రత్ అలి (రజి) ముప్పయి యేళ్ళు చిన్న అన్న మాట.

హజ్రత్ అలి (రజి) నాన్నగారు అబూతాలిబ్‌కు అనేకమంది సంతానం ఉన్నారు. కాని ఆయన ఆర్థిక పరిస్థితి మాత్రం అంతంత మాత్రమే ఉంది. దానికి కరువు కూడా తోడయి ఆయనకు మరిన్ని కష్టాలు తెచ్చిపెట్టింది. ఇల్లు గడవడమే కష్టమైపోయింది. దైవప్రవక్త (సఅసం) తన బాబాయి ఆర్థిక దుస్థితి చూసి చలించిపోయారు. అప్పుడాయన మరో బాబాయి అబ్బాస్ (రజి) దగ్గర ఈ విషయం ప్రస్తావించి, "మనమిద్దరం అబూతాలిబ్ బాబాయి సంతానంలో చెరొక అబ్బాయిని మన సంరక్షణలోకి తీసుకుందాం. ఈ విధంగా ఆయనకు కాస్త భారం తగ్గుతుంది" అని చెప్పారు. హజ్రత్ అబ్బాస్ (రజి) దానికి సంతోషంగా అంగీకరించారు. అప్పుడు ఆయన హజ్రత్ జాఫర్ (రజి)ని తన సంరక్షణలోకి తీసుకున్నారు. దైవప్రవక్త (సఅసం) తన సంరక్షణలోకి హజ్రత్ అలి (రజి)ని తీసుకున్నారు.

ఆ రోజు నుండి హజ్రత్ అలి (రజి) దైవప్రవక్త (సఅసం) పెంపకంలో జీవితం గడపసాగారు. దైవప్రవక్త (సఅసం) శ్రీమతి హజ్రత్ ఖదీజా (రజి), హజ్రత్ అలి (రజి)ని ఎంతో ప్రేమగా చూసుకుంటూ పెంచి పెద్దచేశారు.

## ఆయన తల్లిదండ్రులు

హజ్రత్ అలి (రజి) నాన్నగారు అబూతాలిబ్ గతంలో అబ్దుల్ ముత్తలిబ్ మరణం తరువాత దైవప్రవక్త (సఅసం)ను కన్నతండ్రిలా ఎంతో ప్రేమతో పెంచి పెద్దచేశారు. తన కొడుకులకన్నా మిన్నగా చూసుకున్నారు. ప్రతి విషయంలోనూ ఆయనకు పూర్తి మద్దతునిస్తూ కంటికి రెప్పలా కాపాడారు. ఈ కారణంగానే ఆయన తన వంశ స్థులందరితో విరోధం కొనితెచ్చుకున్నారు. అయితే ఆయన తన అంత్యకాలం వరకూ ఇస్లాం స్వీకరించలేకపోయారు. ఈ విషయం దైవప్రవక్త (సఅసం)ను ఎంతో బాధించేది.

హజ్రత్ అలి (రజి) అమ్మగారు హజ్రత్ ఫాతిమా (రజి) కూడా దైవప్రవక్త (సఅసం)ను ఎంతగానో అభిమానించేవారు. కన్నతల్లిలా ఆయన్ని ఎంతో వాత్సల్యంతో పోషించారు. అంతేకాదు, ఆమె ఇస్లాం

స్వీకరించి ముస్లింగా కూడా మారారు. తరువాత తోటి ముస్లింలతో పాటు మక్కా నుండి మదీనాకు వలసపోయారు. చివరికి మదీనాలోనే ఆమె చనిపోయారు. దైవప్రవక్త (సఅసం) ఆమెను ప్రశంసిస్తూ, "నేను అబూతాలిబ్ తరువాత ఆ సాధ్వీమణికే ఎక్కువగా రుణపడి ఉన్నాను" అని అన్నారు.

హజ్రత్ ఫాతిమా (రజి) చనిపోయినప్పుడు దైవప్రవక్త (సఅసం) ఆమె వస్త్రసంస్కారం కోసం తన చొక్కా ఇచ్చారు. ఖనన సమయంలో ఆయన ఆమె సమాధిలోకి కూడా దిగారు. హాషిం వంశంలో ఇస్లాం స్వీకరించిన మొట్టమొదటి వ్యక్తి ఆమెయే.

## ఇస్లాం స్వీకరణ

హజ్రత్ అలి (రజి) పదేళ్ళ వయస్సులో ఉండగానే దేవుడు ముహమ్మద్ మహనీయుడ్ని (సఅసం) తన ప్రవక్తగా చేశాడు. ఆ విషయాన్ని దైవప్రవక్త (సఅసం) తన శ్రీమతి హజ్రత్ ఖదీజా (రజి) ముందు ప్రస్తావించగానే ఆమె ఇస్లాం పట్ల తన విశ్వాసాన్ని ప్రకటించి ముస్లింగా మారారు.

ఒక రోజు దైవప్రవక్త (సఅసం), ఆయన శ్రీమతి హజ్రత్ ఖదీజా (రజి) కలసి నమాజు చేస్తుంటే హజ్రత్ అలి (రజి) చూసి ఆశ్చర్యపోయారు. వాళ్ళిద్దరు నమాజు ముగించిన తరువాత, "మీరిప్పుడు చేసిన పనేమిటి?" అని ఆయన అమాయకంగా ప్రశ్నించారు. ప్రియప్రవక్త (సఅసం) ఆయనకు అసలు విషయాన్ని తెలియజేశారు. అవిశ్వాసం, బహుదైవారాధనల గురించిన చెడు, ఏకదైవారాధన గురించి మంచి ఏమిటో వివరించి ఇస్లాం స్వీకరించమని చెప్పారు. కాని ఈ విషయాలన్నీ హజ్రత్ అలి (రజి)కు వింతగా అన్పించాయి. అందుచేత ఆయన ఆశ్చర్యపోతూ, "నేను మా నాన్నగారిని అడిగి చెబుతాను" అన్నారు. కాని దైవప్రవక్త (సఅసం) తన దైవదౌత్యాన్ని గురించి ఇంకా బహిరంగంగా ప్రకటించనందున, "ఈ విషయాన్ని నీవు అప్పుడే ఎవరి ముందూ ప్రస్తావించకు, నీవు స్వయంగా ఆలోచించి నిర్ణయించుకో" అని చెప్పారు.

ప్రియప్రవక్త (సఅసం) సంరక్షణలో హ[జత్ అలి (రజి)కు మంచి శిక్షణ కూడా లభించింది. పైగా దేవుడు ఆయనకు సద్బుద్ధి, అవగాహనా శక్తి కూడా ప్రసాదించాడు. అందుచేత ఆయన రెండవ రోజే దైవప్రవక్త (సఅసం) దగ్గరకు వచ్చి ఇస్లాం స్వీకరించారు.

## మక్కాలో ఆయన జీవితం

ఇస్లాం స్వీకరించిన తరువాత హ[జత్ అలి (రజి) మక్కాలో పదమూడేండ్లు జీవితం గడిపారు. అనుక్షణం ఆయన దైవప్రవక్త (సఅసం)ను అంటిపెట్టుకొని ఉండేవారు. పరస్పర సలహాసంప్రదింపులలో, విద్యాశిక్షణల సమావేశంలో, బహుదైవారాధకులతో కూడిన చర్చల్లో, ఆరాధన సమయాల్లో లేదా మరే సమావేశంలోనైనా ఆయన దైవప్రవక్త (సఅసం)తో పాటు ఉండేవారు. అందువల్లనే ఆయన కొద్ది కాలంలోనే అనేక ధార్మిక విషయాలు నేర్చుకోగలిగారు.

హ[జత్ ఉమర్ (రజి) ఇస్లాం స్వీకరించక పూర్వం దైవప్రవక్త (సఅసం), ఆయన అనుచరులు ప్రజల కంటబడకుండా రహస్యంగా నమాజు చేస్తుండేవారు. అప్పుడు హ[జత్ అలి (రజి) కూడా ఆయనతో పాటు ఉండేవారు. ఒకసారి ఆయన దైవప్రవక్త (సఅసం)తో కలసి నఖ్లా లోయలో నమాజు చేస్తుంటే అబూతాలిబ్ అటుగా రావడం జరిగింది. ఆయనకు వారిద్దరి ప్రార్థనా తీరు వింతగా అన్పించింది. నమాజు ముగిసిన తరువాత, "మీరు చేస్తున్న ఈ పనేమిటీ?" అని అడిగారు ఆయన. అప్పుడు దైవప్రవక్త (సఅసం) ఆయనకు ఇస్లాం గురించి తెలియజేసి దాన్ని స్వీకరించమని అన్నారు. దానికి అబూ తాలిబ్, "బాగానే ఉంది కాని, నేను మాత్రం ఈ కొత్త ధర్మాన్ని స్వీకరించలేను" అని చెప్పారు. ఆ తరువాత ఆయన వెళ్ళిపోయారు.

## బాల్యంలోనే ఎంత ధైర్యం!

దైవప్రవక్త (సఅసం) తన బంధువులకు ఇస్లాం సందేశం విన్పించడానికి ఒక రోజు వారందర్నీ విందు భోజనానికి పిలిచారు. అప్పుడు హ[జత్ అలి (రజి) వయస్సు పద్నాలుగు సంవత్సరాలు మాత్రమే. దైవప్రవక్త (సఅసం) విందు ఏర్పాటు బాధ్యత ఆయనకే

అప్పగించారు. బంధువులంతా వచ్చారు. హ|జత్ హమ్జా (రజి), హ|జత్ అబ్బాస్ (రజి), అబూలహబ్, అబూతాలిబ్‌లు కూడా వచ్చారు. అందరూ విందుభోజనాన్ని మెచ్చుకుంటూ తృప్తిగా తిన్నారు. భోజనాలు అయ్యాక దైవప్రవక్త (సఅసం) లేచి నిలబడి, "అబ్దుల్ ముత్తలిబ్ సంతానమా! దైవసాక్షిగా చెబుతున్నాను. నేను మీ దగ్గరికి ఇహపర లోకాలకు సంబంధించిన మహాభాగ్యం తీసుకొచ్చాను. మీలో ఎవరు ఈ మహాకార్యంలో నాకు తోడ్పడతారో చెప్పండి" అన్నారు. ఈ మాటకు ఎవరి నుండీ సమాధానం రాలేదు. అంతలో హ|జత్ అలి (రజి) లేచి, "నేను వయస్సులో అందరికంటే చిన్నవాడనైనప్పటికీ, నాకంతగా తెలివితేటలు లేనప్పటికీ నేను మీకు తోడ్పడటానికి సిద్ధంగా ఉన్నాను" అని చెప్పారు. దైవప్రవక్త (సఅసం) బంధువుల వైపు చూస్తూ మరోసారి ప్రశ్నించారు. కాని అడిగిన ప్రతిసారీ హ|జత్ అలి (రజి) తప్ప మరెవరూ తోడ్పడతామని చెప్పలేదు. అందరూ బెల్లం కొట్టిన రాళ్ళలా మౌనంగా ఉండిపోయారు. తరువాత సమావేశం ముగిసింది. అందరూ వెళ్ళిపోయారు.

## ప్రాణం సైతం ఖాతరుచేయని సాహసం

మక్కా బహుదైవారాధకులు దైవప్రవక్త (సఅసం)ను హత్య చేయడానికి పథకం వేసుకున్నారు. దేవుడు ఈ విషయాన్ని తన ప్రవక్త (సఅసం)కు తెలియజేసి రాత్రికి రాత్రే మక్కా వదలి మదీనా వెళ్ళి పొమ్మని ఆజ్ఞాపించాడు.

హ|జత్ అలి (రజి) వయస్సు అప్పుడు ఇరవైమూడు సంవత్సరాలు ఉంటాయి. దైవప్రవక్త (సఅసం) ఆయనకు అన్ని విష యాలు తెలియజేసి, "మక్కా ఖురైషీయులకు అనుమానం రాకుండా ఉండేందుకు ఈ రోజు రాత్రి నీవు నా పడక మీద పడుకో" అని చెప్పారు.

ఇది ఎంతో సాహసంతో కూడుకున్న పని. అయితే హ|జత్ అలి (రజి) దానికీ సిద్ధమయ్యారు. దైవప్రవక్త (సఅసం) ఆ రాత్రే శత్రువుల కంటబడకుండా మక్కా వదలి వెళ్ళిపోయారు.

మక్కా ఖురైషీయులు దైవప్రవక్త (సఅసం) ఇంటిని చుట్టుముట్టారు. హ|జత్ అలి (రజి) మాత్రం లోపల ప్రశాంతంగా నిద్ర

పోతున్నారు. తెల్లవారిన తరువాత ఆయన ఇంట్లో నుంచి బయటికి అడుగుపెట్టారు. ఆయన్ని చూసి బహుదైవారాధకులు నిర్ఘాంతపోయి, "ఏమిటీ ఇలా అయింది? ముహమ్మద్ (సఅసం) ఎక్కడికి పోయాడు?" అని చెప్పుకున్నారు.

ఆ తరువాత వారు హజ్రత్ అలి (రజి)ని గద్దించి అడిగారు. కాని ఆయన తనకేమీ తెలియదని చెప్పారు. దుర్మార్గుల దుష్ట పథకం విఫలమైపోయింది. దేవుని పథకమే సఫలమయింది.

## మదీనా వలస

దైవప్రవక్త (సఅసం) వెళ్ళిపోయిన తరువాత హజ్రత్ అలి (రజి) కొన్నాళ్ళు మక్కాలోనే ఉండిపోయారు. దైవప్రవక్త (సఅసం) చెప్పిన ప్రకారం ఎవరి అమానతులు వారికి అప్పగించారు. ఆ తరువాత ఆయన ఒక రోజు అవకాశం చూసి మక్కా వదలి మదీనా దారి పట్టారు.

హజ్రత్ అలి (రజి) మదీనా చేరుకునేటప్పటికి దైవప్రవక్త (సఅసం) హజ్రత్ కుల్సూమ్ బిన్ హదమ్ (రజి) ఇంట్లో విడిది చేశారు. హజ్రత్ అలి (రజి) కూడా దైవప్రవక్త (సఅసం) దగ్గరే ఉండి పోయారు. దైవప్రవక్త (సఅసం) ముహాజిర్లు, అన్సారుల మధ్య సోదర సంబంధం ఏర్పరచినప్పుడు హజ్రత్ అలి (రజి)కు హజ్రత్ సహల్ బిన్ హనీఫ్ (రజి)తో సోదర సంబంధం కలిగింది.

ఆరేడు నెలల తరువాత దైవప్రవక్త (సఅసం) మదీనాలో మసీదు నిర్మించడం ప్రారంభించారు. ఆ మసీదు నిర్మాణంలో ఇతరులతో పాటు హజ్రత్ అలి (రజి) కూడా చురుకుగా పాల్గొన్నారు.

## మొదటి యుద్ధం

ముస్లింలు మదీనా వలసవచ్చి సంవత్సరం అయిందోలేదో మక్కా ఖురైషీయులు వారిపై దాడిచేయడానికి వచ్చారు. దైవప్రవక్త (సఅసం) 313 మంది అనుచరులను తీసుకొని బదర్ మైదానానికి చేరుకున్నారు. యుద్ధం మొదలయింది. శత్రు పక్షం నుండి ముగ్గురు వీరులు ముందుకు వచ్చి ముస్లింలను సవాలు చేశారు. అప్పుడు

ముస్లింల నుండి హజ్రత్ హమ్జా (రజి), హజ్రత్ అలి (రజి), హజ్రత్ ఉబైదా (రజి) రంగంలోకి దిగారు. ద్వంద్వ యుద్ధం ప్రారంభమైంది. అందరికంటే ముందు హజ్రత్ అలి (రజి) తన ప్రత్యర్థి వలీద్ బిన్ ఉత్బాను ఒకే ఒక దెబ్బతో నేలకూల్చివేశారు. హజ్రత్ ఉబైదా (రజి) షైబాను ఎదుర్కొంటున్నారు. హజ్రత్ అలి (రజి) వలీద్‌ని కడతేర్చిన వెంటనే షైబా మీదికి లంఘించి అతడ్ని కూడా మట్టుబెట్టారు.

దాంతో బహుదైవారాధకులు రెచ్చిపోయి సామూహిక యుద్ధం ప్రారంభించారు. హజ్రత్ అలి (రజి) సుడిగాలిలా శత్రుసైనికుల్లోకి దూసుకుపోయి హోరాహోరీగా పోరాడసాగారు. ఆయన ధాటికి శత్రువులు రక్తసిక్తమయి నిలువలేక నేల కూలిపోసాగారు. యుద్ధం ముగిసింది. విజయం ముస్లింలనే వరించింది. వారు డెబ్బయి మంది ఖైదీలతో పాటు అపారమైన యుద్ధసొత్తు తీసుకొని మదీనా తిరిగి వచ్చారు. ఇది ముస్లింలకు బహుదైవారాధకులకు మధ్య జరిగిన మొదటి యుద్ధం. ఇందులో బహుదైవారాధకులు ఘోరంగా ఓడి పలాయనం చిత్తగించారు.

## ప్రవక్త (సఅసం) కుమార్తెతో వివాహం

హిజ్రీ శకం రెండవ సంవత్సరం హజ్రత్ అలి (రజి) దైవప్రవక్త (సఅసం) సన్నిధికి పోయి ఆయన చిన్న కూతురు హజ్రత్ ఫాతిమా (రజి)ను వివాహం చేసుకోదలచినట్లు తెలియజేశారు. దానికి దైవప్రవక్త (సఅసం), "సరే, నీ దగ్గర మహర్ చెల్లించడానికి ఏమైనా ఉందా?" అని అడిగారు. "నా దగ్గర ఒక గుఱ్ఱం, ఒక యుద్ధకవచం ఉన్నాయి" అన్నారు హజ్రత్ అలి (రజి). "గుఱ్ఱాన్ని అలా ఉంచు. యుద్ధకవచం అమ్మేయి" అని చెప్పారు దైవప్రవక్త (సఅసం). హజ్రత్ అలి (రజి) యుద్ధకవచం తీసుకొని హజ్రత్ ఉస్మాన్ (రజి) దగ్గరకు వెళ్ళారు. ఆయనకు కవచాన్ని నాల్గొందల ఎనభై దిర్హంలకు అమ్మి ఆ పైకం తెచ్చి దైవప్రవక్త (సఅసం) చేతిలో పెట్టారు. అప్పుడు దైవప్రవక్త (సఅసం) హజ్రత్ అలి (రజి) పెళ్ళి హజ్రత్ ఫాతిమా (రజి)తో జరిపించారు.

పెళ్ళయిన తరువాత కూడా హజ్రత్ అలి (రజి) కొంతకాలం పాటు దైవప్రవక్త (సఅసం) ఇంట్లోనే ఉన్నారు. తరువాత దైవప్రవక్త (సఅసం) కూతురు అల్లుళ్ల కోసం ఒక అద్దె ఇల్లు చూసి ఇద్దర్నీ అక్కడకు పంపివేశారు.

దైవప్రవక్త (సఅసం) తన కుమార్తె పెళ్ళి సందర్భంలో ఒక మంచం, ఒక పడక, ఒక దుప్పటి, ఒక కుండ, రెండు తిరగళ్ళు ఇచ్చారు. ఇవి జీవితాంతం హజ్రత్ అలి (రజి) దగ్గర ఉన్నాయి. అంతకుమించి ఆయన మరెలాంటి ఆస్తి సంపాదించలేకపోయారు.

## ఖైబర్ యుద్ధం

ఆ తరువాత హజ్రత్ అలి (రజి) దాదాపు ప్రతి యుద్ధంలోనూ దైవప్రవక్త (సఅసం) వెంట ఉండి అనన్య ప్రతిభా పరాక్రమాలు చూపారు. అయితే ఆయన యుద్ధ ఘనకార్యాల్లో ఖైబర్ విజయం ఎంతో ప్రసిద్ధి చెందింది. ఈ యుద్ధం హిజ్రీ శకం ఏడవ యేట జరిగింది.

యూదులు రకరకాల కుట్రలు, కుతంత్రాలకు పాల్పడుతుండే వారు. అందుచేత వారిని మదీనా నుంచి కూడా బహిష్కరించవలసి వచ్చింది. అప్పుడు వారంతా ఖైబర్‌కు వెళ్ళి నివసించసాగారు. అక్కడ వారికి పటిష్ఠమైన కోటలు ఉన్నాయి. వారి ఆగడాలతో విసిగిపోయి దైవప్రవక్త (సఅసం) ఖైబర్‌పై దాడిచేశారు. మొదటి రోజు యుద్ధ పతాకం హజ్రత్ అబూబకర్ (రజి)కు ఇవ్వడం జరిగింది. కాని పగలంతా యుద్ధం జరిగినా ఎలాంటి ఫలితం లేకపోయింది. రెండవ రోజు యుద్ధపతాకం హజ్రత్ ఉమర్ (రజి) చేతికి లభించింది. అయినా విజయం లభించలేదు. అప్పుడు దైవప్రవక్త (సఅసం) యోధులతో మాట్లాడుతూ, "రేపు నేను ఈ పతాకాన్ని విజయం సాధించే వీరునికి ఇస్తాను. ఆ వీరుడు అల్లాహ్‌ను, ఆయన ప్రవక్తను అభిమానించేవాడు. అల్లాహ్, ఆయన ప్రవక్త కూడా అతడ్ని అభిమానిస్తారు" అని చెప్పారు.

ఈ ప్రకటన వినగానే ప్రతి యోధుడూ, ఆ అదృష్టవంతుడు తానైతే బాగుండునని భావించసాగాడు.

## ఖైబర్ విజయం

మరునాడు ఉదయం ఈ మహాభాగ్యం దక్కించుకునే అదృష్ట వంతుడెవరో చూడటానికి అందరూ తీవ్రంగా నిరీక్షించసాగారు. అంతలో దైవప్రవక్త (సఅసం) హజ్రత్ అలి (రజి)ని పిలిచారు. ఈ పేరు మిగతావారందరి ఆశలకు భిన్నంగా ఉంది. కారణం హజ్రత్ అలి (రజి) కళ్ళకలకతో బాధపడుతూ యుద్ధానికి పోకుండా గుడారం లోనే ఉండిపోయారు. నరే, దైవప్రవక్త (సఅసం) పిలున్తున్నారని వినగానే ఆయన లేచివచ్చారు. దైవప్రవక్త (సఅసం) ఆయన కళ్ళకు తన లాలాజలం రాశారు. వెంటనే ఆయన కళ్ళకలక నయ మయింది. అప్పుడు దైవప్రవక్త (సఅసం) సమరధ్వజం హజ్రత్ అలి (రజి)కి ఇచ్చి యుద్ధరంగానికి పంపించారు.

యూదులు దాడికి సిద్ధంగా ఉన్నారు. వారి సుప్రసిద్ధ నాయకుడు ప్రముఖ మల్లయోధుడయిన మర్హబ్ యుద్ధరంగంలో హజ్రత్ అలి (రజి)ని చూడగానే ఎంతో ఆవేశంతో ఊగుతూ, గాండ్రిస్తూ ముందుకు వచ్చాడు. వెనువెంటనే ఇరువురి ఖడ్గాలు తళతళ లాడుతూ నిప్పురవ్వలు రాల్చడం మొదలెట్టాయి. పోటి తీవ్రంగా సాగుతోంది. అయితే హజ్రత్ అలి (రజి) మరింత గట్టిగా విజృంభించి దెబ్బ మీద దెబ్బ వేస్తూపోయారు. ఆ తరువాత కాస్సేపటికే మర్హబ్ ఒకే ఒక గావుకేక పెట్టి నేల కూలిపోయాడు. హజ్రత్ అలి (రజి) కోటను ముట్టడించారు. ముస్లింలు యూదులపై విరుచుకుపడ్డారు. నాయకుడు వధించబడగానే యూదుల గుండెలు పగిలిపోయాయి. వారు ముస్లింల ధాటికి నిలువలేక పారిపోయారు. ముస్లింలు కోటపై విజయపతాకం ఎగరవేశారు.

## ధర్మ ప్రచారం

హజ్రత్ అలి (రజి) యుద్ధసేనతో పాటు ధర్మప్రచార రంగంలో కూడా ముమ్మందు ఉండేవారు. ఆయన ఎప్పుడూ విధి నిర్వహణలో ఏ మాత్రం ఏమరుపాటుకు లోనయ్యేవారు కాదు. ఈ విషయంలో యమన్ సంఘటన చాలా ప్రసిద్ధిచెందింది.

హిజ్రీ శకం పదవ సంవత్సరం జరుగుతోంది. ఒక రోజు దైవ ప్రవక్త (సఅసం) హజ్రత్ అలి (రజి)ని పిలిచి యమన్‌కు వెళ్ళి అక్కడి ప్రజలకు ధర్మబోధ చేయాలని ఆదేశించారు.

హజ్రత్ అలి (రజి) ఈ మాట విని, "దైవప్రవక్తా! నాకంటే వయసులో పెద్దవాళ్ళు, అనుభవజ్ఞులయిన ఉమర్ (రజి) లాంటి వాళ్ళను వదలి యమన్ లాంటి ప్రాంతానికి నన్ను పంపుతున్నారా! యమన్‌వాసులకు నచ్చజెప్పడం, వారి వివాదాలను పరిష్కరించడం నాలాంటి బలహీనుడికి చాలా కష్టంతో కూడిన పనులు" అని అన్నారు. దైవప్రవక్త (సఅసం) ఆయనకు నచ్చజెప్పి ఆయన గుండెను నిమురుతూ, "దేవా! ఇతని హృదయానికి మార్గదర్శక భాగ్యం ప్రసాదించు. ఇతని నోటిని సత్యం మాట్లాడేలా చెయ్యి" అని ప్రార్థించారు.

హజ్రత్ అలి (రజి) యమన్‌కు వెళ్ళి అక్కడి ప్రజలకు ధర్మబోధ చేయడం ప్రారంభించారు. వాళ్ళను ఎంతో ఆత్మీయతా భావంతో కలుసుకొని మాట్లాడేవారు. ఎంతో ప్రేమతో, హృదయానికి హత్తుకునేలా వారికి ఇస్లాం గురించి వివరించేవారు. దాంతో యమన్ ప్రజలు క్రమంగా ప్రభవితులయిపోసాగారు. చూస్తుండగానే వారి జీవిత దశ తిరిగిపోయింది. హమ్దాన్ తెగ మొత్తం ఇస్లాం స్వీకరించింది.

## ప్రియప్రవక్త (సఅసం) ఎడబాటు

దైవప్రవక్త (సఅసం) దివంగతులయ్యారు. ప్రియప్రవక్త (సఅసం) ఎడబాటుతో హజ్రత్ అలి (రజి) ఎంతో ఖిన్నులైపోయారు. హజ్రత్ ఫాతిమా (రజి) పరిస్థితి అయితే చెప్పనవసరం లేదు. ఆమె పుట్టెడు దుఃఖంతో జబ్బుపడ్డారు. రోజురోజుకు చిక్కిపోసాగారు. హజ్రత్ అలి (రజి) ఆమెకు సపర్యలు చేస్తూ ఆమె హృదయానికి సాంత్వన చేకూర్చడానికి అన్ని విధాలా ప్రయత్నించారు. ఆమెను వదలి ఇంటి నుంచి బయటికి పోవడాన్ని కూడా మానేశారు. అందువల్లనే ఆయన హజ్రత్ అబూబకర్ (రజి) ఖిలాఫత్ పదవి కోసం బైత్ (శపథం) చేయడానికి కూడా వెళ్ళలేకపోయారు.

ఈ విధంగా ఆర్నెల్లు గడచిపోయాయి. చివరికి హజ్రత్ ఫాతిమా (రజి) ఆ అనారోగ్యంతోనే చనిపోయారు. ఆ తరువాత హజ్రత్ అలి (రజి) స్వయంగా హజ్రత్ అబూబకర్ (రజి) దగ్గరికి పోయి బైత్ చేశారు.

హజ్రత్ అబూబకర్ (రజి) ప్రతి వ్యవహారంలోనూ హజ్రత్ అలి (రజి) సలహా తీసుకునేవారు. హజ్రత్ అలి (రజి) నిష్పక్షపాతంగా, ఎలాంటి అరమరికలు లేకుండా తన అభిప్రాయం చెప్పేవారు. మత భ్రష్టులు మదీనాపై దాడి చేసినప్పుడు ఆయన గట్టిగా నిలబడి వారిని ఎదుర్కొన్నారు.

రెండేళ్ళ మూడు నెలల పరిపాలన తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) కూడా ఇహలోకం వీడిపోయారు. ఆయన స్థానంలో హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) ఖలీఫా అయ్యారు.

## ఆయన అందరితో సహకరించారు

హజ్రత్ అలి (రజి) రెండవ ఖలీఫా హజ్రత్ ఉమర్ (రజి)కు కూడా తన పూర్తి సహకారం అందజేశారు. హజ్రత్ ఉమర్ (రజి) కూడా ముఖ్యమైన వ్యవహారాల్లో ఆయన సలహా తీసుకోకుండా ముందడుగు వేసేవారు కాదు. నిహావంద్ యుద్ధంలో హజ్రత్ ఉమర్ (రజి) హజ్రత్ అలి (రజి)ని సేనాపతిగా నియమించదలిచారు. కాని అందుకు ఆయన అంగీకరించలేదు. హజ్రత్ ఉమర్ (రజి) బైతుల్ మఖ్దిస్‌కు వెళ్ళేటప్పుడు హజ్రత్ అలి (రజి)ని తన స్థానంలో తాత్కాలిక ఖలీఫాగా నియమించారు. హజ్రత్ అలి (రజి) తన కుమార్తె ఉమ్మె కుల్సూమ్ (రజి)ని హజ్రత్ ఉమర్ (రజి)కు ఇచ్చి వివాహం చేశారు.

హజ్రత్ ఉమర్ (రజి) తరువాత హజ్రత్ ఉస్మాన్ (రజి) ఖలీఫాగా ఎన్నికయ్యారు. ఆయన పాలనా చివరి దశలో పెద్ద పెద్ద అల్లర్లు, అలజడులు సంభవించాయి. హజ్రత్ అలి (రజి) అల్లరి మూకకు నచ్చజెప్పడానికి శతవిధాల ప్రయత్నించారు. హజ్రత్ ఉస్మాన్

(రజి) ఆయనను సలహా అడుగుతూ, "దేశంలో ప్రస్తుతం ఏర్పడిన అలజడులకు మూలకారణం ఏమిటీ, దాని నివారణోపాయం ఏమిటీ?" అని అడిగారు. హజ్రత్ అలి (రజి) దానికి సమాధానమిస్తూ, "మీ అధికారులు అనుసరిస్తున్న హద్దుమీరిన విధానాలే ఈ సంక్షోభానికి మూలకారణం" అన్నారు ఎలాంటి మొహమాటం లేకుండా.

హజ్రత్ ఉస్మాన్ (రజి) మాట్లాడుతూ, "అధికారులను ఎంపిక చేయడంలో నేను ఉమర్ (రజి) అవలంబించిన పద్ధతుల్నే పాటించాను కదా! మరి ఎందుకీ సంక్షోభం?" అని అన్నారు. దానికి హజ్రత్ అలి (రజి) సమాధానమిస్తూ, "ఉమర్ (రజి) అధికారులందరి ముకుతాళ్ళు తన పిడికిలిలో పెట్టుకున్నారు. ఆయన అధికారుల విషయంలో చాలా కఠినంగా ఉండేవారు. మీరేమో ఎంతో మృదు మనస్కులు. మీ మృదుస్వభావాన్ని ఆసరాగా చేసుకొని అధికారులు ఇష్టా రాజ్యం చేస్తున్నారు. ప్రజలు ఇదంతా మీ ఆదేశం ప్రకారమే జరుగుతోందని భావిస్తున్నారు. అందుకే వారు మిమ్మల్ని లక్ష్యంగా పెట్టుకొని అల్లర్లకు పాల్పడుతున్నారు" అని అన్నారు.

## ఖలీఫా అయిన వైనం

రాజధాని నగరంలో అలజడులు మరింత పెచ్చరిల్లాయి. అల్లరిమూకలు అవకాశం చూసి హజ్రత్ ఉస్మాన్ (రజి)ని హతమార్చివేశారు. హజ్రత్ అలి (రజి) ఖలీఫా హత్య సంగతి వినగానే తీవ్రంగా ఆందోళన చెందారు. ఆయన ఖలీఫా అంగరక్షకులపై ఆగ్రహం వెలిబుచ్చారు. అంగరక్షకులుగా నియమించబడిన తన కొడుకులకు ఆయన ఆ తరువాత శిక్ష కూడా విధించారు.

హజ్రత్ ఉస్మాన్ (రజి) హత్య తరువాత మదీనాలో అల్లర్లు హద్దుమీరిపోయాయి. ప్రతి మనిషి తన ధన, మాన, ప్రాణాలను కాపాడుకునే ప్రయత్నంలో ఇంట్లో కూర్చుండిపోయాడు. తరువాత ఖలీఫాగా ఎవరు వస్తారనే విషయాన్ని గురించే జనం పట్టించుకోవడం లేదు. అల్లరిమూకలు తమ లక్ష్యం నెరవేరింది గనక ఇక మదీనా నుండి వెళ్ళిపోవచ్చు. కాని అలా వెళ్ళిపోతే తమ నిర్వాకాలన్నీ తిరుగు

బాటు కింద పరిగణించబడే ప్రమాదం ఉంది. అందువల్ల అల్లరి మూకలు అప్పుడే మదీనా వదలిపెట్టకుండా ఖలీఫా పదవి కోసం కొందరు ప్రముఖుల్ని కలుసుకొని మాట్లాడారు. కాని వారు ఖలీఫా పదవి స్వీకరించడానికి నిరాకరించారు. అప్పుడు అల్లరిమూకలు రెండు రోజుల్లో ప్రజలు ఖలీఫాను ఎన్నుకోకపోతే తాము అలి, తల్హా, జుబైర్ (రజి)లను హతమార్చుతామని ప్రకటించాయి.

ఈ ప్రకటన వినగానే జనంలో పెద్ద గందరగోళం చెలరేగింది. వారు ఇండ్లలో నుంచి బయటికొచ్చి ఖలీఫా ఎన్నిక సంగతి మాట్లాడు కోవడం ప్రారంభించారు. హజ్రత్ తల్హా (రజి), హజ్రత్ జుబైర్(రజి)లు ఖిలాఫత్ బాధ్యతలు స్వీకరించడానికి నిర్ద్వంద్వంగా నిరాక రించారు. హజ్రత్ అలి (రజి) కూడా అంగీకరించలేదు. అయితే ముహాజిర్, అన్సార్ ముస్లింల నుండి తీవ్రమైన వత్తిడి రావడంతో ఆయన మార్గాం తరంలేక ఖలీఫా కావడానికి అంగీకరించారు. ప్రజలు ఆయన చేతిలో చేయివేసి ఖిలాఫత్ పదవి కోసం బైత్ (శపథం) చేయడానికి విరగ బడ్డారు. ఈ విధంగా మూడవ రోజు హిజ్రీ శకం 35వ సంవత్సరం, జిల్‌హజ్జ 21వ తేదీన హజ్రత్ అలి (రజి) ఖలీఫాగా ఎన్నికయ్యారు.

## హంతకుడి జాడ లేదు

హజ్రత్ అలి (రజి) ఖలీఫా అయిన తరువాత మొట్టమొదట తీసుకోవలసిన చర్య హజ్రత్ ఉస్మాన్ (రజి) హంతకులను వెదకి పట్టుకోవలసి ఉంది. కాని హత్య జరిగినప్పుడు అక్కడ హజ్రత్ ఉస్మాన్ (రజి)గారి శ్రీమతి నాయిలా (రజి) తప్ప మరెవరూ లేరు. పైగా ఆమె ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి)ని తప్ప మరెవరినీ గుర్తుపట్టలేరు. ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి)ని పట్టు కున్నప్పుడు ఆయన ప్రమాణం చేస్తూ, "నేను హజ్రత్ ఉస్మాన్ (రజి) గారిని చంపే ఉద్దేశ్యంతోనే వెళ్ళాను. కాని ఆయన అన్న ఒక మాటతో నేను సిగ్గుపడి వెనక్కి తిరిగొచ్చాను. ఆ తరువాత ఇతరులు ఆయన్ని హతమార్చారు. వారెవరో నాకు తెలియదు" అని చెప్పాడు. హజ్రత్ నాయిలా (రజి) అతని మాటల్ని ధృవపరిచారు. ఎంత పరిశోధించినా

హంతకుల జాడ తెలియరాలేదు. సాక్షులు కూడా దొరకలేదు. కేవలం అనుమానంతో ఎవరినీ బలవంతం చేయడం భావ్యంకాదని భావించారు హజ్రత్ అలి (రజి). అదీగాక అప్పట్లో ఉన్న క్లిష్ట పరిస్థితుల్లో, హంతకుల్ని పట్టుకొని వారిని శిక్షించడం అనుకున్నంత సులభమైన వ్యవహారం కాదు. అందువల్ల హజ్రత్ అలి (రజి) గత్యంతరంలేక ఖలీఫా హత్య విషయంలో ఎలాంటి చర్యా తీసుకోలేక పోయారు.

## గవర్నర్ల బదిలీలు

గవర్నర్ల హద్దుమీరిన ప్రవర్తన, వారి అధికార దుర్వినియోగం కారణంగానే దేశంలో ఇలాంటి పరిస్థితులు ఏర్పడ్డాయని హజ్రత్ అలి (రజి) భావించేవారు. ఆ విషయాన్నే ఆయన హజ్రత్ ఉస్మాన్ (రజి)కు కూడా చెప్పారు. అందువల్ల ముందుగా ఈ పరిస్థితుల్ని దూరం చేస్తే ఆ తరువాత హంతకులకు విధించే శిక్షను గురించి ఆలోచించవచ్చని ఆయన అనుకున్నారు.

ఈ ఆలోచనతో హజ్రత్ అలి (రజి) గవర్నర్లందరినీ బదిలీ చేశారు. వారి స్థానాల్లో కొత్త గవర్నర్లను నియమించారు. అయితే సిరియా గవర్నర్ అమీర్ మావియా (రజి) సైనికులు కొత్త గవర్నర్ని తబూక్ దగ్గర ఆపి బలవంతంగా మదీనా తిప్పిపంపారు. ఈ విషయం తెలిసి హజ్రత్ అలి (రజి) అమీర్ మావియా (రజి)కు ఒక ఉత్తరం రాస్తూ, "ముహాజిర్, అన్సార్ ముస్లింలందరూ నా చేతిలో బైత్ చేశారు. అందువల్ల నీవు కూడా నా దగ్గరకు వచ్చి బైత్ చెయ్యి. లేదా యుద్ధం చేయడానికి సిద్ధంగా ఉండు" అని అన్నారు.

అమీర్ మావియా (రజి) తన ప్రత్యేక దూత ద్వారా దానికి సమాధానం పంపారు. ఉత్తరంలో బిస్మిల్లా తరువాత హజ్రత్ అలి (రజి) పేరు తరువాత కింద తన పేరు రాశారు. ప్రత్యేక దూత విషయం వివరిస్తూ, "హజ్రత్ ఉస్మాన్ (రజి) హత్యతో జనంలో పెద్ద కలకలం చెలరేగింది. అరవై వేల మంది ప్రజలు ప్రతీకారం తీర్చుకోవడానికి తహతహలాడిపోతున్నారు. ఈ వ్యవహారంలో జరుగుతున్న

జాప్యానికి మీరే బాధ్యులని మా గవర్నర్ గారు భావిస్తున్నారు" అని అన్నాడు. అమీర్ మావియా (రజి) పంపిన ఈ ఉత్తరం, తన దూత ద్వారా చెప్పించిన ఈ పలుకుల్ని బట్టి ఆయన స్పష్టంగా యుద్ధ ప్రకటన చేశారని తెలుస్తోంది. అందువల్ల హజ్రత్ అలి (రజి) కూడా యుద్ధ సన్నాహాలు ప్రారంభించారు.

## బస్రా ఆక్రమణ

హజ్రత్ తల్హా (రజి), జుబైర్ (రజి)లు కూడా ముందుగా హజ్రత్ ఉస్మాన్ (రజి) హంతకుల నుండి ప్రతీకారం తీర్చుకోవాలని భావించారు. పరిస్థితులు కాస్త చక్కబడిన తరువాత హంతకుల విషయం ఆలోచిద్దాం అని హజ్రత్ అలి (రజి) ఎంత చెప్పినా వారిద్దరు వినకుండా మక్కా వెళ్ళిపోయారు. దారిలో హజ్రత్ ఆయిషా (రజి) హజ్ చేసి మక్కా నుండి వస్తూ తారసపడ్డారు. వారిద్దరు మదీనా పరిస్థితులు వివరించారు. దాంతో ఆమె వారిద్దరితో కలసి మక్కా తిరిగొచ్చారు.

మక్కా చేరుకున్న తర్వాత ముందు బస్రాపై దాడి చేయాలని, అక్కడ హజ్రత్ ఉస్మాన్ (రజి) హంతకులు ఉన్నారు గనక బస్రాను స్వాధీనం చేసుకోవాలని నిశ్చయించారు. హిజ్రీ శకం 36 రబీవుల్ అవ్వల్ నెలలో సైన్యం బస్రా బయలుదేరింది. బస్రా సమీపానికి చేరుకున్న తరువాత బస్రా గవర్నర్ వారి రాకకు కారణం ఏమిటని అడిగాడు. ఉస్మాన్ (రజి) హంతకుల్ని బంధించడానికి వచ్చామని హజ్రత్ ఆయిషా (రజి) తెలిపారు.

అప్పుడు రెండు వర్గాలవారు ఎదురెదురుగా వచ్చి నిల్చు న్నారు. ఉభయులు ఒకరికొకరు నచ్చజెప్పుకోవడానికి ప్రయత్నించారు. ఇలా చర్చలు అనేక రోజులు కొనసాగాయి. బస్రా సైన్యంలో యుద్ధం తప్ప మరో మాట వినని అల్లరిమూకలు కూడా ఉన్నాయి. ఒక వైపు చర్చలు జరుగుతుండగానే అల్లరిమూకలు హజ్రత్ ఆయిషా (రజి) ఒంటెపై దాడి చేశాయి. ఆ విధంగా యుద్ధం మొదలయింది. చివరికి

మక్కా నుంచి వచ్చిన సైన్యం బస్రా ఆక్రమించుకుంది. ఈ సంఘటన హిజ్రీ శకం 36, రబీవుల్ ఆఖిర్ నెలలో సంభవించింది.

## సయోధ్య దిశగా చర్చలు

హజ్రత్ ఆయిషా (రజి), తల్హా (రజి), జుబైర్ (రజి)ల పర్యవేక్షణలో ఒక సైనిక దళం బస్రా బయలుదేరిందని ఖలీఫా హజ్రత్ అలి (రజి)కి సమాచారం అందింది. దాంతో ఆయన తన సిరియా పర్యటన రద్దుచేసుకొని తక్షణమే సైన్యం తీసుకొని బస్రా బయలు దేరారు. హజ్రత్ అలి (రజి) సైన్యంలో అల్లరిమూకలు కూడా అనేకులు ఉన్నారు. ఈ దుర్మార్గులు హజ్రత్ ఉస్మాన్ (రజి)ని హత మార్చడంతో తృప్తిచెందక ముస్లింలలో చీలికలు సృష్టించి ఖిలాఫత్ వ్యవస్థనే తుద ముట్టించదలిచారు. అయితే వారు తమ దురుద్దేశ్యాన్ని బహిర్గతం చేయకుండా హజ్రత్ అలి (రజి) శ్రేయోభిలాషులుగా ఆయన సైన్యంలో చేరి ఉన్నారు.

హజ్రత్ అలి (రజి) బస్రా చేరుకునేటప్పటికి, బస్రా హజ్రత్ ఆయిషా (రజి) సైన్యం ఆక్రమణలోకి పోయింది. హజ్రత్ అలి (రజి) పోగానే చర్చల కోసం హజ్రత్ తల్హా (రజి), జుబైర్ (రజి)ల దగ్గరికి ఖాఖాని పంపించారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) హత్యకు ప్రతీకారంగా ఇప్పటికే అనేకమంది వధించబడ్డారని, మీరింకా ఏమి చేయదలచు కున్నారని ఆయన ఖాఖా ద్వారా అడిగారు. తాను హజ్రత్ ఉస్మాన్ (రజి) హంతకులకు శిక్ష విధించనిదే వదలిపెట్టే ప్రసక్తి లేదని, కాక పోతే కాస్త పరిస్థితులు చక్కబడేవరకు ఓపిక పట్టవలసి ఉంటుందని కూడా ఆయన చెప్పి పంపించారు. హజ్రత్ తల్హా (రజి), జుబైర్ (రజి)లకు, హజ్రత్ అలి (రజి) రాయబారి ఖాఖాకు మధ్య అనేక రోజులు చర్చలు జరిగాయి. చివరికి హజ్రత్ తల్హా (రజి), జుబైర్ (రజి)లు పరిస్థితులు అర్థం చేసుకొని రాజీ ధోరణి వ్యక్తపరిచారు. ఉభయుల్లో ఎవరూ స్వార్థ ప్రయోజనాలు ఆశించేవారు లేనందున సయోధ్య కుదిరే అవకాశాలు కన్పించసాగాయి.

## మోసం చేశారు

ఈ సంగతి తెలియగానే హజ్రత్ ఉస్మాన్ (రజి) హంతకులు, అబ్దుల్లా బిన్ సబా అనుచరులు గగ్గోలు పెట్టారు. ఈ దుర్మార్గులలో అనేక మంది హజ్రత్ అలి (రజి) సైన్యంలో నివురుగప్పిన నిప్పులా ఉన్నారు. వెంటనే వారు పరస్పరం సంప్రదించుకొని ఒక పథకం రూపొందించుకున్నారు.

ఒక రోజు రాత్రివేళ అంతా సద్దుమణిగింది. ఉభయ పక్షాల సైనికులు గాఢ నిద్రలో ఉన్నారు. అప్పుడు ఈ కుట్రదారులు లేచి అకస్మాత్తుగా హజ్రత్ ఆయిషా (రజి) సైన్యంపై దాడిచేశారు. ఉభయ పక్షాల సైనికులు కంగారుపడుతూ లేచి ప్రత్యర్థి సైన్యం తమను మోసగించిందని భావించింది. వెంటనే అందరూ ఆయుధాలు తీసు కొని యుద్ధానికి దిగారు. సంకుల సమరం సాగింది. హజ్రత్ అలి (రజి) గుఱ్ఱం మీద సైన్యానికి ముందు వచ్చి నిలబడ్డారు. ఆయన హజ్రత్ జుబైర్ బిన్ అవ్వామ్ (రజి)ని పిలిచి దైవప్రవక్త (సఅసం) చెప్పిన ఒక భవిష్యత్ ప్రకటన విన్పించారు. అది వినగానే జుబైర్ (రజి) ఉద్రేకం చల్లబడిపోయింది. ఆ తరువాత ఆయన యుద్ధ రంగం నుండి తప్పుకొని వెళ్ళిపోయారు. హజ్రత్ తల్హా (రజి) మాత్రం యుద్ధం చేస్తూ అమరగతినొందారు. హజ్రత్ జుబైర్ (రజి) యుద్ధం నుండి తప్పుకొని వెళ్ళిపోతున్నప్పుడు అబ్దుల్లా బిన్ సబా అనుచరుడు ఒకతను ఆయన వెనకే బయలుదేరాడు. అలా కొంచెం దూరం పోయిన తరువాత అవకాశం చూసి ఆయన్ని హతమార్చాడు.

## జమల్ యుద్ధం పర్యవసానం

ఇప్పుడు యుద్ధరంగంలో ప్రధాన పాత్రధారి హజ్రత్ ఆయిషా (రజి) మిగిలి ఉన్నారు. ఆమె ఒంటె మీద అంబారీలో కూర్చున్నారు. ఈ కారణంగానే ఈ యుద్ధానికి జమల్ (ఒంటె) యుద్ధం అన్నారు. హజ్రత్ అలి (రజి) సైన్యంలో ఉన్న కలహకారులు, సబాయి

మూకలు అత్యుత్సాహంతో పోరాడుతున్నారు. ఎలాగైనా విశ్వాసుల మాతృమూర్తి హ్రజత్ ఆయిషా (రజి)ను లొంగదీసుకొని బంధించాలన్న దుర్బుద్ధితో ఆ దుర్మార్గులు నేరుగా ఆమె ఒంటె వైపు దూసుకు వచ్చి వలయంగా ఏర్పడ్డారు. విశ్వాసుల మాతృమూర్తి (రజి)ని ప్రాణప్రదంగా అభిమానించే యోధులు ఆమె చుట్టూ కవచంగా నిలబడి శత్రువులతో తీవ్రంగా పోరాడుతున్నారు.

హ్రజత్ అలి (రజి) ఈ పరిస్థితి గమనించి తీవ్రంగా ఆందోళన చెందారు. వెంటనే ఆయన ఒక సైనికుడికి హ్రజత్ ఆయిషా (రజి) ఒంటె కాలు మీద వ్రేటు వేయమని సైగచేశారు. అలాగే ఆ సైనికుడు ఒంటె కాలు మీద వ్రేటు వేయగానే ఒంటె చతికిలబడింది. దాంతో యుద్ధ తీవ్రత తగ్గిపోయింది. హ్రజత్ అలి (రజి) విశ్వాసుల మాతృ మూర్తి (రజి) సోదరుడు ముహమ్మద్ బిన్ అబూబకర్‌ని పిలిచి "మీ సోదరి దగ్గరికెళ్ళి ఆమె యోగక్షేమాలు విచారించి రా" అని చెప్పారు. తరువాత ఆయన పారిపోయేవారిని వెంటాడవద్దని, క్షతగాత్రుల పైనుంచి గుఱ్ఱాలను పరుగెత్తించవద్దని, యుద్ధసొత్తును స్వాధీనం చేసుకోకూడదని, ఆయుధాలు విసర్జించినవారికి ప్రాణరక్షణ ఉంటుం దని ప్రకటనగావించారు. ఆ తరువాత ఆయన హ్రజత్ ఆయిషా (రజి) దగ్గరికి వెళ్ళి ఆమె యోగక్షేమాలు విచారించారు. కొన్నాళ్ళు బస్రాలో ఉన్న తరువాత ఆమెను ముహమ్మద్ బిన్ అబూబకర్ వెంట మదీనా పంపించారు. హ్రజత్ ఆయిషా (రజి) బస్రా నుంచి బయలుదేరుతూ ప్రజలను సంబోధిస్తూ, "ప్రజలారా! మా ఇరువురి మధ్య ఈ ఘర్షణ ఒక అపార్థం వల్ల జరిగింది. అంతేగాని నాకు, అలి (రజి)కి మధ్య ఎలాంటి జగడం లేదు" అన్నారు. హ్రజత్ అలి (రజి) ఆ విషయాన్ని సమర్థించారు.

## రాజధాని మారింది

జమల్ యుద్ధం తరువాత హ్రజత్ అలి (రజి) మదీనా నగరం వదలి కూఫాలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. అంటే రాజధాని నగరం హిజాజ్ నుండి ఇరాఖ్‌కు మారిందన్న మాట. కూఫా వెళ్ళిన తరువాత హ్రజత్ అలి (రజి) మరోసారి హ్రజత్ మావియా (రజి)కు

ఉత్తరం రాశారు. తన ఎన్నికపై బస్రాలో తలెత్తిన వ్యతిరేకత ఇప్పుడు అంతమైపోయిందని, కనుక ఇప్పుడు మీరు కూడా విధేయులైపోయి ప్రజలలో రక్తపాతం నివారించండని ఆయన ఈ లేఖలో పేర్కొన్నారు. ఈ ఉత్తరానికి అమీర్ మావియా (రజి) సమాధానం రాయకుండా, తన విధేయత ఉస్మాన్ (రజి) హంతకుల శిక్షతో ముడిపడి ఉందని, కనుక ఉస్మాన్ (రజి) హంతకులను తనకు అప్పగించాలని ప్రత్యేక దూత ద్వారా చెప్పి పంపారు.

హజ్రత్ అలి (రజి) అమీర్ మావియా (రజి) దగ్గర్నుంచి దూత తెచ్చిన సమాధానం విని, సరే, రేపటిదాకా ఆగండి, పరిస్థితి ఏమిటో ప్రత్యక్షంగా మీరే చూస్తారు అని చెప్పారు. మరునటి రోజు మావియా (రజి) దూత వచ్చి చూస్తే అక్కడ దాదాపు పదివేల మంది సాయుధుల గుంపు కన్పించింది. వారు ఆయన్ని చూడగానే, "మేమంతా ఉస్మాన్ (రజి) హంతకులం" అన్నారు ముక్త కంఠంతో. వాళ్ళను చూసి దూత నిర్ఘాంతపోయాడు. అప్పుడు హజ్రత్ అలి (రజి), "ఉస్మాన్ (రజి) హంతకుల్ని అదుపులో పెట్టే శక్తి నాకెంత ఉందో మీరిప్పుడు గ్రహించి ఉంటారు" అన్నారు దూతతో. ఈ సమాధానం విన్న తరువాత దూత వెళ్ళిపోయాడు. హజ్రత్ అలి (రజి) మార్గాంతరంలేక అమీర్ మావియా (రజి)కు వ్యతిరేకంగా యుద్ధప్రకటన చేసి, సైనిక సమీకరణలో నిమగ్నులైపోయారు.

## నీటి సరఫరా నిలిపివేశారు

హజ్రత్ అలి (రజి) దాదాపు 80 వేల మంది సైనికులతో సిరియా సరిహద్దులకు చేరుకున్నారు. అయితే ముందు చేరుకున్న సైనిక దళాన్ని సిరియా సైనికులు అడ్డుకున్నారు. దాంతో రెండు దళాల మధ్య యుద్ధం మొదలయింది. ఆ రోజు పగలంతా యుద్ధం జరిగింది. రాత్రివేళ సిరియా సైన్యం వెనక్కి తగ్గి పరిస్థితి స్వరూపాన్ని హజ్రత్ మావియా (రజి)కు తెలియజేసింది.

అప్పుడు హజ్రత్ మావియా (రజి) యుద్ధరంగాన్ని సఫ్ఫీన్ నదీ మైదానానికి మార్చమని చెప్పారు. సిరియా సైన్యం సఫ్ఫీన్‌కు చేరుకొని

నదీ రేవులను ఆక్రమించుకుంది. అలి (రజి) సైన్యానికి నీళ్ళు తీసుకో నివ్వరాదని కూడ అమీర్ మావియా (రజి) తన సైన్యాన్ని ఆదేశించారు.

హజ్రత్ అలి (రజి) సైన్యం సఫ్ఫీన్‌కు చేరుకుంది. కాని నీటి వసతులన్నీ సిరియా సైన్యం అధీనంలో ఉన్నందున కూఫా సైన్యం నీటికి కటకటలాడిపోయింది. అప్పుడు నీళ్ళు తీసుకోనివ్వకుండా అడ్డు కుంటున్న సిరియా సైనికులపై కూఫా సైనికులు దాడి చేశారు. దాంతో సిరియా సైనికులు కూఫా సైనికుల ధాటికి నిలువలేక వెనక్కి తగ్గారు. వెంటనే నీటి రేవుల్ని కూఫా సైనికులు ఆక్రమించుకున్నారు. అయితే వారు సిరియా సైనికుల్ని నీళ్ళు తీసుకోనివ్వకుండా అడ్డగించ లేదు. ఉభయపక్షాల సైనికులు రేవుల దగ్గరకొచ్చి నిరభ్యంతరంగా నది నీటిని వాడుకోవడం, పరస్పరం మాట్లాడుకోవడం, కలసిమెలసి తిరగడం ప్రారంభించారు.

## సయోధ్య కోసం మరో ప్రయత్నం

ఉభయపక్షాల మధ్య ప్రారంభంలో చిన్న చిన్న ఘర్షణలు జరుగుతుండేవి. కాని రజబ్ నెల రాగానే యుద్ధం ఆగిపోయింది. సయోధ్య కోసం అవకాశాలు మెరుగుపడ్డాయి. హజ్రత్ అబుద్దర్దా (రజి), హజ్రత్ అబూ అమామా బాహిలీ (రజి) ఇద్దరూ హజ్రత్ అమీర్ మావియా (రజి) దగ్గరకు వెళ్ళి, "మీరు అలి (రజి)తో ఎందుకు యుద్ధం చేస్తున్నారు? ఖలీఫా పదవి కోసం ఆయన మీకంటే ఎక్కువ హక్కుదారుడు కాదా?" అని అడిగారు. దానికి అమీర్ మావియా (రజి) సమాధానమిస్తూ, "నేను ఉస్మాన్ (రజి) హంతకుల నుండి ప్రతీకారం తీర్చుకోవడానికి మాత్రమే యుద్ధం చేస్తున్నాను" అన్నారు. వారు మళ్ళీ, "అంటే ఉస్మాన్ (రజి)ని అలి (రజి)యే హత్యచేశారని మీరు భావిస్తున్నారా?" అని అడిగారు.

అమీర్ మావియా (రజి) మాట్లాడుతూ, "నేనలా భావించడం లేదు. కాని అలి (రజి), ఉస్మాన్ (రజి) హంతకులకు ఆశ్రయ మిచ్చారు. ఆయన గనక హంతకులను నాకు అప్పగిస్తే నేను బైత్ చేయడానికి సిద్ధంగా ఉన్నాను" అని చెప్పారు.

ఈ మాట విన్న తరువాత వారిద్దరు హజ్రత్ అలి (రజి) దగ్గరకు పోయి అమీర్ మావియా (రజి) విధించిన షరతు సంగతి తెలియ జేశారు. ఈ మాట వినగానే దాదాపు ఇరవైవేల మంది సైనికులు సైన్యం నుంచి బయటికొచ్చి, "మేమంతా ఉస్మాన్(రజి) హంత కులం" అని అన్నారు. ఈ వ్యవహారం చూడగానే వారిద్దరు విస్తు బోయి చూస్తూ, "ఇంతమందిని అదుపులో ఉంచడం కష్టమే" అని భావించారు. సైన్యం నుంచి బయటికొచ్చి తామే ఉస్మాన్ (రజి) హంతకులం అని చెప్పుకున్న సాయుధమూకలు ఆ తరువాత యుద్ధంలో పాల్గొనకుండా రంగం వదలి తీర ప్రాంతం దిశగా వెళ్ళి పోయారు.

## మళ్ళీ యుద్ధం మొదలయింది

హిజ్రీ శకం 37, సఫర్ నెలలో యుద్ధం మళ్ళీ మొదలయింది. అది రోజురోజుకు తీవ్రమవుతూ పోయింది. అనేక రోజులు యుద్ధం సాగింది. శుక్రవారం వచ్చినా యుద్ధం ఆగలేదు. పైపెచ్చు అది మరింత తీవ్రమయింది. ఆ రోజు రాత్రి కూడా తెల్లవారేదాకా యుద్ధం జరిగింది. రక్తం ఏరులై ప్రవహించింది. శవాలు గుట్టలు గుట్టలుగా పడ్డాయి. క్షతగాత్రుల మూల్గుడు ధ్వనులతో యుద్ధరంగం భీకరంగా తయారయింది.

మరునటి రోజు ఉదయం శవాలను, క్షతగాత్రులను తీయ డానికి యుద్ధం తాత్కాలికంగా నిలుపుదలచేశారు. అప్పుడు చూస్తే విజయం హజ్రత్ అలి (రజి) వైపు మొగ్గుతున్నట్లు గోచరించింది. యుద్ధం ఇలాగే కొనసాగితే తాము ఓటమి చవిచూడవలసి వస్తుందని హజ్రత్ అమీర్ మావియా (రజి) భావించారు. దాంతో ఆయన సంధి కోసం హజ్రత్ అలి (రజి) దగ్గరికి రాయబారం పంపారు. కాని హజ్రత్ అలి (రజి) సంధి ప్రతిపాదనను నిరాకరించారు. దాంతో అమీర్ మావియా (రజి) ఆందోళన చెందసాగారు. అప్పుడు అమ్ర్ బిన్ ఆస్ (రజి) ముందుకు వచ్చి, "మీరేమీ కంగారు పడకండి. రేపు నేనొక ఎత్తుగడ వేస్తాను. ఆ ఎత్తుగడతో యుద్ధం ఆగిపోతుంది. లేదా అలి (రజి) సైన్యంలో చీలికన్నా వస్తుంది" అని చెప్పారు.

## ఎత్తుగడ ఫలించింది

హిజ్రీ శకం 37, సఫర్ నెల జరుగుతోంది. రెండు సైన్యాలు ఎదురెదురుగా వచ్చి నిలబడ్డాయి. యుద్ధం ప్రారంభమయ్యే సమ యానికి సిరియా సైన్యం నుంచి ఒక సైనికదళం బరిసెలకు ఖుర్ఆన్ ప్రతులు కట్టుకొని ముందుకొచ్చింది. వారు ఒక ప్రకటన చేస్తూ, "ఇదిగో దైవగ్రంథం ఉంది చూడండి. దీని ద్వారానే మన మధ్య తీర్పు జరగాలి" అన్నారు. ఈ దృశ్యం చూసి హజ్రత్ అలి (రజి) సైన్యంలో కలకలం బయలుదేరింది. కొందరు సిరియా సైనికులతో గొంతు కలిపారు. మరికొందరు యుద్ధం చేయడానికే సిద్ధమయ్యారు. ఈ విధంగా హజ్రత్ అలి (రజి) సైన్యం రెండు వర్గాలుగా విడి పోయింది. ఇది సిరియా సైన్యం పన్నిన కుట్ర అని, వారు ఓటమి పాలయ్యే సూచనలు కన్పించగానే ఇలాంటి పన్నాగం పన్నారని హజ్రత్ అలి (రజి) ఎంత నచ్చజెప్పినా ఎవరూ వినలేదు. సిరియన్ల ఎత్తుగడ ఫలించింది. ఎంత ప్రయత్నించినా ఒక వర్గం యుద్ధం చేయ డానికి ససేమిరా అంగీకరించలేదు. చివరికి విధిలేక యుద్ధం ఆపేయ వలసి వచ్చింది. తర్వాత ఖిలాఫత్ సమస్యను పరిష్కరించడానికి ఇద్దరు మధ్యవర్తులు నియమించబడాలని, వారిద్దరు తీసుకునే నిర్ణయాన్ని ఉభయపక్షాలు ఆమోదించాలని చర్చల ద్వారా నిర్ణయం జరిగింది.

ఈ నిర్ణయం ప్రకారం హజ్రత్ మావియా (రజి) తరఫున హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి), హజ్రత్ అలి (రజి) తరఫున హజ్రత్ అబూ మూసా అష్అరీ (రజి) మధ్యవర్తులుగా నియమించబడ్డారు.

## మళ్ళీ అదే ఎత్తుగడ

నిర్ణీత తేదీ నాడు హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి), అమ్ర్ బిన్ ఆస్ (రజి) ఇద్దరు దూమతుల్ జందల్‌లో సమావేశమయ్యారు. వారి వెంట నాలుగేసి వందల మంది అనుచరులు ఉన్నారు. ఒక శిబిరంలో చర్చలు ప్రారంభమయ్యాయి. ఇద్దరూ తీవ్రంగా చర్చించు కున్నారు. చివరికి హజ్రత్ అలి (రజి), హజ్రత్ మావియా (రజి) ఇద్దరినీ

ఖిలాఫత్ పదవి నుంచి తొలగించి, తిరిగి ముస్లిం సలహామండలి ద్వారా కొత్త ఖలీఫా ఎన్నుకోబడాలని నిర్ణయం జరిగింది.

ఈ నిర్ణయం ప్రకారం మరునాడు ఉభయపక్షాలవారు మసీదులో సమావేశమయ్యారు. మొదట హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి) లేచి ఖిలాఫత్ పదవి నుండి హజ్రత్ అలీ (రజి)ని తొలగిస్తున్నట్లు తన నిర్ణయాన్ని ప్రకటించారు. అయితే హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) వంతు వచ్చినప్పుడు ఆయన ఎంతో తెలివిగా తన నిర్ణయాన్ని మార్చి ప్రకటించారు. ఆయన ప్రజలను సంబోధిస్తూ, "ప్రజలారా! అబూమూసా (రజి), అలీ (రజి)ని పదవి నుండి తొలగించినట్లు నేను కూడా అలీ (రజి)ని పదవి నుండి తొలగిస్తున్నాను. అయితే ఖలీఫాగా, హజ్రత్ ఉస్మాన్ (రజి) వారసునిగా మావియా (రజి) ఎక్కువ అర్హుడయినందున అతడ్ని మాత్రం నేను ఆ పదవిలో స్థిరపరుస్తున్నాను" అని అన్నారు. ఈ ప్రకటన వినగానే ప్రజలు తీవ్ర ఆందోళన వ్యక్తపరుస్తూ అమీర్ మావియా (రజి)కు వ్యతిరేకంగా నినాదాలు చేయడం ప్రారంభించారు.

## కొత్త మతవర్గం

సంధి కోసం ప్రయత్నాలు జరిగినప్పుడే హజ్రత్ అలి (రజి) సైన్యంలో విభేదాలు వచ్చాయి. ఇప్పుడీ తీర్పు వారికి అగ్ని మీద ఆజ్యం పోసినట్లయింది. వారు బహిరంగంగానే దాన్ని వ్యతిరేకించడం ప్రారంభించారు. ధార్మిక వ్యవహారంలో ఎవరిని నిర్ణయాధికారిగా చేసినా అది అవిశ్వాసం (కుఫ్ర్) క్రిందికి వస్తుందని, అలా చేసేవారు, దాన్ని అంగీకరించేవారు అంతా అవిశ్వాసులవుతారని, ఈ మత విశ్వాసాన్ని నమ్మనివారిని హతమార్చడం ధర్మసమ్మతమేనని వారు బాహాటంగా చెప్పసాగారు. నిర్ణయాధికారం అల్లాహ్‌కు మాత్రమే ఉందనేది వారి సిద్ధాంతమైపోయింది. ఈ మతవర్గాన్ని చరిత్ర 'ఖార్జీలు' అని పేర్కొన్నది.

వారు హజ్రత్ అలి (రజి) చేతిలో చేయి వేసి చేసిన శపథాన్ని భంగపరచి, అబ్దుల్లా బిన్ వహబ్ అర్రాసి చేతిపై బైత్ (శపథం)

చేశారు. అలాంటి విశ్వాసం కలవారంతా నహర్‌వాన్‌లో గుమిగూడి హత్యా రక్తపాతాలు జరపడం మొదలెట్టారు. వారు తమ సిద్ధాంతాన్ని ప్రచారం చేస్తూ ప్రజలను తమకు అనుకూలంగా మలచుకోవడం ప్రారంభించారు. తమ సిద్ధాంతాన్ని అంగీకరించనివారిని నిర్దాక్షిణ్యంగా హతమార్చేవారు.

## నహర్వాన్ యుద్ధం

హ[జత్ అలి (రజి) సిరియాపై దండెత్తడానికి మరొకసారి ప్రయత్నాలు ప్రారంభించారు. కాని ఖార్జీల తిరుగుబాటు, రక్తపాతాల వార్తలు విని ఆయన తన నిర్ణయాన్ని మార్చుకున్నారు. ముందు ఖార్జీలను శిక్షించి వారికి గుణపాఠం నేర్పాలని నిర్ణయించుకున్నారు.

అందుచేత ఆయన నహర్వాన్ చేరుకొని హ[జత్ అబూ అయ్యూబ్ అన్సారీ (రజి), ఖైస్ బిన్ సాద్ బిన్ ఉబాదా (రజి)లను ఖార్జీలకు నచ్చజెప్పడానికి వారి దగ్గరకు పంపించారు. కాని వారు ఖార్జీలతో జరిపిన చర్చలు విఫలం కావడంతో వెనుదిరిగి వచ్చారు. ఆ తరువాత హ[జత్ అలి (రజి) ఖార్జీలపై యుద్ధం ప్రారంభించారు. ఖార్జీలలో కొందరు యుద్ధం ప్రారంభానికి ముందే రంగం నుంచి పారిపోయారు. మరికొందరు పశ్చాత్తాపం చెంది హ[జత్ అలి (రజి) పక్షంలో చేరి పోయారు. మిగిలిన నాలుగు వేలమంది ఖార్జీలు తీవ్రంగా పోరాడారు. కాని చివరికి ఓటమిపాలై అనేకమంది పలా యనం చిత్తగించారు. అయితే వారు రాజ్యం నలువైపులా వ్యాపించి హ[జత్ అలి (రజి)కి వ్యతిరేకంగా విద్వేషవిషం వెదజల్లడం ప్రారం భించారు.

ఈ యుద్ధం హి[జీ శకం 37, షవ్వాల్ నెలలో జరిగింది.

## ఈజిప్టుపై మూవియా (రజి) ఆక్రమణ

హ[జత్ అలి (రజి) కొన్ని వదంతులతో ప్రభావితులయి ఈజిప్టు గవర్నర్ హ[జత్ ఖైస్ బిన్ సాద్ (రజి)ని ఆ పదవి నుండి తొలగించి

వెనక్కి పిలిపించుకున్నారు. ఆయన స్థానంలో ముహమ్మద్ బిన్ అబూ బకర్‌ని నియమించారు. అయితే ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి) ఉద్రేక స్వభావంగల మనిషి. ఆయన ఈజిప్టు పోగానే చాలా కఠినంగా వ్యవహరించడం మొదలెట్టారు. దాంతో జనంలో తిరుగుబాటు ధోరణి తలెత్తింది. హజ్రత్ అమీర్ మావియా (రజి) ఈ అవకాశాన్ని వినియోగించుకుంటూ ఈజిప్టుపై దాడిచేయమని హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి)ని ఆదేశించారు. అటు హజ్రత్ అలి (రజి) గవర్నర్‌కు సహాయం చేయడానికి ఇష్తర్ నఖయిని పంపించారు. అయితే ఇష్తర్ నఖయి ఈజిప్టు చేరుకోకముందే దారిలో ఒక ధనికుడు అతడ్ని విష ప్రయోగం ద్వారా చంపివేశాడు.

సిరియా నుంచి అమ్ర్ బిన్ ఆస్ (రజి) ఒక పెద్ద సైన్యం తీసుకొని ఈజిప్టు చేరుకున్నారు. ముహమ్మద్ బిన్ అబూబకర్‌కు ఆ సైన్యాన్ని ఎదుర్కోవడం చాలా కష్టమయిపోయింది. మరోవైపు హజ్రత్ అమీర్ మావియా (రజి) కూడా సైన్యంతో వచ్చి ఈజిప్టు సైన్యాన్ని చుట్టుముట్టారు. భీకర యుద్ధం జరిగింది. ముహమ్మద్ బిన్ అబూ బకర్ సైనికుల్లో అనేకమంది హతమయ్యారు. మిగిలినవారు కాలికి బుద్ధిచెప్పారు. పాపం ముహమ్మద్ బిన్ అబూబకర్ పారిపోయి ఒక శిథిల భవనంలో దాక్కున్నారు. కాని సిరియా సైనికులు అక్కడకు కూడా చేరుకొని ఆయన్ని నిర్దాక్షిణ్యంగా హతమార్చారు. ఈ విధంగా హిజ్రీ శకం 38లో ఈజిప్టు హజ్రత్ అలి (రజి) నుంచి చేజారి, హజ్రత్ మావియా (రజి) ఆక్రమణలోకి పోయింది.

## నలువైపులా తిరుగుబాటులే

ఈజిప్టు చేజారిపోవడంతో ఖిలాఫత్ వ్యవస్థకు చాలా నష్టం జరిగింది. ఒక వైపు ఖార్జీలు దేశంలో అరాచకం, అలజడులు సృష్టిస్తూ ఇస్లామీయ ప్రభుత్వానికి చికాకు కలిగిస్తుంటే; మరోవైపు హజ్రత్ అమీర్ మావియా (రజి) అవకాశం దొరికితేచాలు, దాడిచేయడానికి కాచుకొని ఉన్నారు. హిజ్రీ శకం 40లో ఆయన బసర్ బిన్ అర్తాత్‌కు మూడువేల మంది సైనికుల్ని ఇచ్చి మదీనాపై దాడిచేయడానికి

పంపించారు. బసర్ సైన్యం తీసుకొని వేగంగా మదీనా చేరుకున్నాడు. అప్పుడు మదీనాకు గవర్నర్‌గా హ్రజత్ అబూఅయ్యూబ్ అన్సారీ (రజి) ఉన్నారు. ఆయనకు మదీనాలో రక్తపాతం జరగడం ఇష్టం లేదు. అందుచేత ఆయన మదీనా వదలిపెట్టి కూఫా వెళ్ళిపోయారు.

బసర్ బిన్ అర్తాత్ మదీనా పౌరులను భయపెట్టి వారిచేత మావియా (రజి) కోసం బలవంతంగా బైత్ (శపథం) చేయించాడు. అదేవిధంగా అతను మక్కా, యమన్‌లలో కూడా ప్రజల చేత బల వంతంగా బైత్ చేయించాడు. మక్కాలో అతను కొందరి ఇండ్లను నయితం కూలగొట్టించాడు. యమన్‌లో ఘోరమైన దౌర్జన్యకాండ జరిపాడు. హ్రజత్ అలి (రజి) సోదరుని కుమారులను చాలా దారుణంగా చంపించాడు.

ఈ పరిస్థితుల్ని చూసి హ్రజత్ అలి (రజి) తీవ్రంగా ఆందోళన చెందారు. ఆయన ఈ తిరుగుబాటుల్ని అణచివేయడానికి ఎంతగానో ప్రయత్నించారు. అన్నిటికంటే ఖార్జీల అలజడులు చాలా చికాకు కలిగించాయి.

## అమరగతి

నహర్వాన్ యుద్ధంలో ఖార్జీలు వేల సంఖ్యలో వధించబడ్డారు. అందువల్ల వారు ప్రతీకారంతో ఉడికిపోతూ అలి (రజి), మావియా (రజి), అమ్ర్ బిన్ ఆస్ (రజి) జీవించి ఉన్నంతవరకూ ఈ అంతః కలహాలు, రక్తపాతాలు అంతంకావని తీర్మానించారు. ఈ పని కోసం వారు ముగ్గురిని తయారుచేశారు. హ్రజత్ అలి (రజి)ని హతమార్చ డానికి అబ్దుర్రహ్మాన్ బిన్ బల్జమ్‌ను, హ్రజత్ మావియా (రజి)ను చంపడానికి బర్క్ బిన్ అబ్దుల్లా తమీమీని, హ్రజత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి)ని వధించడానికి అమ్ర్ బిన్ బకర్ తమీమీని నియమించారు.

నిర్ణీత పథకం ప్రకారం హిజ్రీ శకం 40, రమజాన్ నెల 17వ తేదీన ఆ ముగ్గురిపై ఒకేసారి దాడి జరిగింది. అమీర్ మావియా (రజి)పై దాడి జరిగినప్పటికీ ఆయన ఎలాగో కత్తివేటు నుంచి తప్పించుకున్నారు. హ్రజత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) ఆ రోజు నమాజ్

చేయించడానికి మసీదుకు రాలేదు. అందుచేత ఆయన కూడా ప్రాణా పాయం నుంచి తప్పించుకున్నారు. అయితే ఆయన స్థానంలో నమాజ్ చేయించడానికి వచ్చిన మనిషి మాత్రం వధించబడ్డాడు. కూఫాలో హజ్రత్ అలి (రజి) తెల్లవారుజామున జామియా మసీదులో ప్రవేశించి యథాప్రకారం నిద్రపోతున్నవారిని లేవసాగారు. కుట్రదారుడు ఇబ్నె బల్జమ్ అవకాశం చూసి హజ్రత్ అలి (రజి)పై మెరుపుదాడి చేశాడు. దాంతో హజ్రత్ అలి (రజి) కుప్పకూలిపోయారు. జనం వెంటనే హంతకుడ్ని పట్టుకున్నారు.

హంతకుడు విషం పూయబడిన ఖడ్గం ఉపయోగించాడు. అందువల్ల దాని ప్రభావం శరీరంలో అతి వేగంగా వ్యాపించింది. చివరికి హజ్రత్ అలి (రజి) రమజాన్ నెల 20వ తేదీ, శుక్రవారం రాత్రి వేళ శాశ్వతంగా కన్నుమూశారు. (ఇన్నాలిల్లాహి వ ఇన్నాఇలైహి రాజివూన్). అప్పటికి ఆయన వయస్సు 63 సంవత్సరాలు. ఆయన నాలుగేళ్ళ తొమ్మిది నెలలు మాత్రమే పరిపాలన చేశారు. దేవుడు ఆయన పట్ల ప్రసన్నుడవుగాక!

## ఆయన భార్యలు

హజ్రత్ అలి (రజి) విభిన్న సమయాల్లో మొత్తం తొమ్మిది మంది స్త్రీలను వివాహమాడారు. వారి పేర్లు ఇలా ఉన్నాయి:

1) హజ్రత్ ఫాతిమా జహ్రా (రజి): ఈమె మన ప్రియప్రవక్త (సఅసం) చిన్న కుమార్తె. ఆమె హిజ్రీ శకం 11లో చనిపోయారు.

2) హజ్రత్ ఉమ్మల్ బనైన్ బిన్తె హిజామ్ కలాబియా: హజ్రత్ ఫాతిమా (రజి) చనిపోయిన తరువాత ఈమెను చేసుకున్నారు.

3) లైలా బిన్తె మస్వూద్ తమీమి.

4) అస్మా బిన్తె ఉమీస్ ఖసామియ.

5) సహిబా బిన్తె రబియా.

6) అమామా బిన్తె అబిల్ ఆస్: ఈమె హజ్రత్ జైనబ్ (రజి) కుమార్తె, మన ప్రియప్రవక్త (సఅసం) మనుమరాలు.

7) ఖౌలా బిన్త్ జాఫర్ హనఫియా: ఈమె హఖ్బా తెగకు చెందిన స్త్రీ.

8) ఉమ్మె సయీద్ బిన్త్ ఉర్వా సఖ్ఫియా.

9) మహ్యాత్ బిన్త్ ఖైస్ కల్బి.

వీరు కాకుండా మరికొందరు బానిస మహిళలు కూడా ఉన్నారు.

# సంతానం

హ్రజత్ అలి (రజి) సంతానం:

1) హ్రజత్ హసన్ (రజి)

2) హ్రజత్ హుసైన్ (రజి)

3) ముహ్సిన్

4) హ్రజత్ జైనబ్ కుబ్రా

5) హ్రజత్ ఉమ్మె కుల్సూమ్ కుబ్రా

వీరంతా హ్రజత్ ఫాతిమా బిన్త్ రసూలుల్లాహ్ (సఅసం) ద్వారా జన్మించారు. హ్రజత్ హసన్ (రజి)ని ప్రత్యర్థులు విషమిచ్చి చంపారు. హ్రజత్ హుసైన్ (రజి) కర్బలాలో అమరగతినొందారు. ముహ్సిన్ చిన్నతనంలోనే చనిపోయారు.

6) అబ్బాస్

7) జాఫర్

8) అబ్దుల్లా

9) ఉస్మాన్

ఈ నలుగురు ఉమ్ముల్ బనైన్ ద్వారా పుట్టారు. అబ్బాస్ తప్ప మిగిలిన ముగ్గురూ హ్రజత్ హుసైన్ (రజి)తో పాటు కర్బలాలో అమరగతి నొందారు.

10) అబ్దుల్లా

11) అబూబకర్

వీరిద్దరు హజ్రత్ లైలా బిన్త్ మస్వూద్ కుమారులు. ఒక ఉల్లేఖనం ప్రకారం వీరు కూడా కర్బలా రణరంగంలో అమరగతి నొందారు.

12) యహ్యా

13) ముహమ్మద్ అస్గర్

వీరిద్దరు హజ్రత్ అస్మా బిన్త్ ఉమీస్ ద్వారా జన్మించారు.

14) ఉమర్

15) రుఖియా

వీరిద్దరు హజ్రత్ సహిబా బిన్త్ రబియా ద్వారా జన్మించారు. ఉమర్ యాభై ఏళ్ళ వయస్సులో మనీబూ అనే ఊళ్ళో చనిపోయారు.

16) ముహమ్మద్ ఔసత్: ఈయన హజ్రత్ ఉమామా (రజి) ద్వారా జన్మించారు.

17) ముహమ్మద్ బిన్ అలి: ఈయన ముహమ్మద్ బిన్ హనఫియా పేరుతో ప్రసిద్ధిచెందారు. హజ్రత్ ఖౌలా బిన్త్ జాఫర్ ద్వారా పుట్టిన సంతానం.

18) ఉమ్ముల్ హసన్

19) రమలా కుబ్రా

వీరిద్దరిలో ఒక అమ్మాయి హజ్రత్ మహ్యాత్ బిన్త్ ఉమ్రాఖైస్ ద్వారా పుట్టి చిన్నతనంలోనే చనిపోయింది.

**బానిస మహిళల ద్వారా పుట్టిన సంతానం ఈ విధంగా ఉంది:**

(1) ఉమ్మెహానీ, (2) మైమూనా, (3) జైనబ్ సగ్రా,(4) ఉమ్మెకుల్సూమ్ సగ్రా, (5) ఫాతిమా, (6) ఉమామా, (7) ఖుదీజా, (8) ఉమ్ముల్ కరాం, (9) ఉమ్మె సల్మా, (10) ఉమ్మెజాఫర్, (11) జుమానా, (12) నఫీసా, (13) రమలా సగ్రా (రజి).

హజ్రత్ అలి (రజి) సంతతి అయిదుగురు కుమారుల ద్వారా కొన సాగింది. వారి పేర్లు ఇవి:

ఇమామ్ హసన్ (రజి), ఇమామ్ హుసైన్ (రజి), ముహమ్మద్ బిన్ హనఫియా (రజి), అబ్బాస్, ఉమర్ (రజి).

## సద్గుణ సంపత్తి

హ(జత్ అలి (రజి) మధ్యరకం పొడగరి. రంగు చామనఛాయ. కళ్ళు పెద్దవి. సుందరమోము. విశాలమైన వక్షస్థలం, కడుపు కొంచెం ముందుకు వచ్చి ఉంటుంది. తలవెం(టుకలు చిందరవందరగా ఉంటాయి. పొడుగైన గుబురు గడ్డం. జీవిత చరమ దశలో వెం(టుకలన్నీ తెల్లబడిపోయాయి. ఆయన ఒకసారి మా(తమే వెం(టుకలకు గోరింటాకు పూసుకున్నారు.

హ(జత్ అలి (రజి) చాలా నిరాడంబరమైన జీవితం గడిపారు. ఖరీదైన బట్టలు ధరించడమంటే ఆయనకు ఇష్టముండేది కాదు. తలపాగ పెట్టుకునేవారు. చొక్కా చేతులు కురచగా ఉండేవి. లుంగీ చీలమండలకు పైనే ఉండేది. దుస్తులకు అతుకులు ఉండేవి. ఎడమ చేతి (వేలికి వెండి ఉంగరం పెట్టుకునేవారు. దానిపై "అల్లాహుల్ ముల్క్" అని చెక్కబడి ఉండేది. ఖైబర్ యుద్ధం సందర్భంలో దైవ (ప్రవక్త (సఅసం), "దేవా! చలిని, వేడిమిని అలీ (రజి)కి దూరంగా ఉంచు" అని (పార్థించారు. అందువల్ల చలి, వేడిమి ఆయన్ని ఏమా(తం (ప్రభావితం చేసేవికావు.

ఆయన రుషిపుంగవుడిలా జీవితం గడపడానికి ఎక్కువగా ఇష్ట పడేవారు. అతి సాధారణమైన భోజనం మా(తమే తీసుకునేవారు.

## ఆదర్శవంతమైన జీవితం

హ(జత్ అలి (రజి) పోషణ, శిక్షణలు దైవ(ప్రవక్త (సఅసం) పర్య వేక్షణలో జరిగాయి. అందువల్ల ఆయనలో ఎలాంటి చెడులు చోటు చేసుకోలేదు. ఆయన జీవితం ఎంతో ఆదర్శవంతమైనది. ఆయన నోట ఎవరూ ఎన్నడూ కు(ఫ్, షిర్క్‌లకు సంబంధించిన ఎలాంటి మాటా వినలేదు. ఆయన దేవుని ముందు తప్ప ఎవరి ముందూ తలవంచలేదు. మూఢకాలంలోని ఏ దుష్కృత్యం కూడా ఆయనకు అంటలేదు. మద్యం రుచి కూడా ఆయన ఎరగరు. జూదం దరిదాపు

లకే వెళ్ళేవారు కాదు. ఒక్క మాటలో చెప్పాలంటే సకల విధాల సద్గుణ సంపత్తితో మూర్తీభవించిన వ్యక్తిత్వం ఆయనది.

మన ఖలీఫా హజ్రత్ అలి (రజి) ఎంత మంచివారో చూడండి. దేవుడు ఆయన పట్ల ప్రసన్నుడవుగాక!

## నిజాయితీకి నెలవు

హజ్రత్ అలి (రజి) ఎంతో నమ్మకస్థులు, నిజాయితీపరులు. అందుకే దైవప్రవక్త (సఅసం) మదీనా వలస పోతున్నప్పుడు తన దగ్గర ప్రజలు దాచుకున్న వస్తువులన్నీ తిరిగి వారికి ఇచ్చివేయమని చెప్పి వాటిని హజ్రత్ అలి (రజి)కి అప్పగించారు.

ఖలీఫా అయిన తర్వాత కూడా ఆయన ఎంతో నిజాయితీగా, న్యాయంగా వ్యవహరించారు. ఒకసారి ప్రభుత్వ ధనాగారానికి కొన్ని నారింజ పండ్లు వచ్చాయి. కొడుకు చిన్నారి హుసైన్ (రజి) తిందామని ఓ నారింజ పండు తీసుకున్నారు. హజ్రత్ అలి (రజి) వెంటనే కొడుకు చేతిలోని పండు గుంజుకొని ప్రభుత్వ ధనాగారంలో పడవేశారు.

ఒకసారి అస్ఫియాన్ నుండి కొంత యుద్ధసొత్తు వచ్చింది. అందులో ఒక రొట్టె కూడా ఉంది. హజ్రత్ అలి (రజి) ఇతర సామగ్రితో పాటు ఆ రొట్టెను కూడా భాగాలుగా చేసి ప్రజలకు పంచారు.

మరొకసారి ఆయన ప్రభుత్వ ధనాగారంలోని సొమ్మంతా ప్రజలకు పంచిన తరువాత దాన్ని శుభ్రంగా ఊడ్చి, దైవం పట్ల కృతజ్ఞతగా రెండు రకాతుల నమాజ్ చేశారు.

## బైరాగి జీవితం

హజ్రత్ అలి (రజి) ప్రాపంచిక ఆకర్షణలు, పటాటోపాలు అంటే భయపడేవారు. లోకంలో మనుగడ సాగించడానికి కొద్ది సామగ్రి చాలని భావించేవారు, హజ్రత్ ఫాతిమా (రజి)కు తండ్రి ఇచ్చిన సామగ్రి మాత్రమే చివరిదాకా ఇంట్లో ఉండింది. హజ్రత్ అలి (రజి)

అవే చాలని, అవి తప్ప మరే జీవితావసర వస్తువులు అవసరం లేదని భావించారు.

ఖలీఫా అయిన తరువాత కూడా ఆయన జీవితాంతం అలాగే గడిపారు. ఒకసారి అబ్దుల్లా బిన్ జరీర్ అనే మనిషి హజ్రత్ అలి (రజి)తో పాటు భోజనానికి కూర్చున్నారు. ఆయన ముందు పెట్టబడిన అతి సాధారణ భోజనం చూసి, "విశ్వాసుల నాయకా! మీకు పక్షి మాంసం పట్ల ఆసక్తి లేదా?" అని అడిగాడు. దానికి హజ్రత్ అలి (రజి) సమాధానమిస్తూ, "ఇబ్నె జరీర్! ఖలీఫాకు ప్రభుత్వ ధనాగారంలో రెండు గిన్నెల భోజనం మాత్రమే తీసుకోవడానికి అధికారం ఉంది. ఒక గిన్నె తనకు, తన భార్యాపిల్లల కోసం, రెండవ గిన్నె దైవదాసుల కోసం వాడాలి" అని అన్నారు.

## ఏ యాచకుడూ వట్టి చేతులతో పోడు

హజ్రత్ అలి (రజి) ఎంతో ఉదార స్వభావులు. ఆయన ఇంటి నుంచి ఏ యాచకుడు కూడా వట్టి చేతులతో వెళ్ళేవాడు కాదు.

ఒకసారి ఆయన ఒక తోటలో రాత్రి తెల్లవారేదాకా నీళ్ళు తోడి ఒక సేరు యవలు కూలి సంపాదించారు. వాటిని ఇంటికి తీసికెళ్ళి పిండి విసిరి అందులో మూడోవంతు పిండితో గంజిని తయారు చేయించారు. గంజి ఉడికి సిద్ధమయిన తరువాత తిందామని భావించినప్పుడు ఒక నిరుపేద వచ్చి యాచించాడు. హజ్రత్ అలి (రజి) ఆ గంజి అంతా నిరుపేదకు దానం చేశారు. మిగిలిన పిండిలో సగం మళ్ళీ గంజి తయారుచేయించారు. కాని అంతలో ఒక అనాథ వచ్చి ధర్మం చేయి బాబూ! అన్నాడు. హజ్రత్ అలి (రజి) ఆ గంజిని కూడా దానం చేశారు. ఆ తరువాత మిగిలిన పిండితో మళ్ళీ గంజి తయారుచేయించారు. కాని తిందామని కూర్చుంటే ఒక ఖైదీ వచ్చి దానం అడిగాడు. హజ్రత్ అలి (రజి) ఆ గంజిని కూడా దైవమార్గంలో అతనికిచ్చివేశారు. ఇలా వీరవిశ్వాసి రాత్రంతా శ్రమపడి కూలి చేసినా, మరునాడు పగలంతా పస్తులుండవలసి వచ్చింది. దేవునికి ఈ సదాచరణ ఎంతగానో నచ్చింది. అప్పుడు ఆయన ఈ ఆయత్‌ని అవతరింపజేశాడు:

**"వారు తమ మొక్కుబడులు నెరవేరుస్తారు. నలుదిశలా ఆపద వ్యాపించే రోజు పట్ల భయపడుతుంటారు. వారు దేవుని మీద ప్రేమ పారవశ్యంతో నిరుపేదలకు, అనాథలకు, ఖైదీలకు అన్నదానం చేస్తారు."**
**(దివ్యఖుర్ఆన్-76:7,8)**

## అబూతురాబ్

ఒకసారి దైవప్రవక్త (సఅసం) హ్జ్రత్ అలి (రజి)ని వెతుకుతూ మసీదుకు వచ్చారు. అక్కడ చూస్తే హ్జ్రత్ అలి (రజి) మట్టి నేలపై పడుకొని ఉన్నారు. పక్క గుడ్డ వీపు క్రింద నుంచి జారిపోయి ఉంది. వీపుకు బాగా మట్టి అంటుకొని ఉంది. దైవప్రవక్త (సఅసం)కు ఈ నిరాడంబరత నచ్చింది. ఆయన హ్జ్రత్ అలి (రజి) దగ్గర కూర్చొని తన శుభహస్తాలతో మట్టి తుడిచేస్తూ, "ఓ అబూతురాబ్ (ఓ మట్టి మనిషీ!) ఇక లేచి కూర్చో" అన్నారు.

ప్రియప్రవక్త (సఅసం) ప్రసాదించిన ఈ బిరుదు హ్జ్రత్ అలి (రజి)కి ఎంతగా నచ్చిందంటే, ఎవరైనా ఆ పేరుతో పిలిస్తే ఆయన మహా సంబరపడిపోయేవారు.

## ప్రతిభా పరాక్రమాలు

హ్జ్రత్ అలి (రజి) అసాధారణమైన ప్రతిభా పరాక్రమాలు గల వీరుడు. ఆయన ముఖ్యమైన యుద్ధాలన్నిటిలోనూ పాల్గొని తన ప్రతిభా పరాక్రమాలు ప్రదర్శించారు.

బదర్ యుద్ధం సమయంలో హ్జ్రత్ అలి (రజి) మంచి యవ్వనంలో ఉన్నారు. ఆ యుద్ధంలో ఆయన ఒక సుప్రసిద్ధ అరబ్బు వీరుడయిన వలీద్ బిన్ ఉతబాతో పోరాడవలసి వచ్చింది. ఆ వీరుడ్ని ఆయన ఒకే ఒక వ్రేటుతో కూల్చి శాశ్వతంగా కడతేర్చారు. ఆ తరువాత షైబా అనే యోధుడు వస్తే అతడ్ని కూడా మట్టుబెట్టారు.

ఉహుద్ యుద్ధంలో తల్హా బిన్ అబీ తల్హా పోటీ కోసం సవాలు చేసినప్పుడు అతడ్ని ఎదుర్కోవడానికి హ్జ్రత్ అలి (రజి)యే ముందుకొచ్చారు. ఖడ్గంతో ఒక్క వ్రేటు వేయగానే అతని తల పుచ్చకాయలా పగిలి రెండు బ్రద్దలయిపోయింది.

కందకం యుద్ధంలో సుప్రసిద్ధ మల్లయోధుడు అమ్ర్ బిన్ అబ్ద్ ముందుకొచ్చి ముస్లిం యోధులను సవాలు చేశాడు. అప్పుడు కూడా హజ్రత్ అలి (రజి)యే ముందుకు వచ్చారు. చూస్తుండగానే ఆయన బెబ్బులిలా లంఘించి అతడ్ని ఒక్క దెబ్బతో రక్తపు మడుగులో పడ వేశారు.

ఖైబర్ యుద్ధంలో కోటను జయించడం, మర్హబ్ అనే సుప్రసిద్ధ మల్లయోధుడ్ని ఓడించడం సామాన్య విషయం కాదు. కాని హజ్రత్ అలి (రజి) అంతటి బలాఢ్యుణ్ణి కూడా మట్టి కరిపించి కోటను జయించారు. దీన్నిబట్టి హజ్రత్ అలి (రజి) ఎంతటి పరాక్రమశాలియో ఆలోచించండి. దేవుడు ఆయన పట్ల ప్రసన్నుడవుగాక!

## చట్టం పట్ల గౌరవం

ఒకసారి హజ్రత్ అలి (రజి) కవచం ఎక్కడో పోయింది. తరువాత అది ఒక యూదుడి దగ్గర ఉందని తెలిసింది. ఆయన ఆ యూదుడి దగ్గరికెళ్ళి తన కవచం ఇవ్వమని అడిగారు. అతను కవచం ఇవ్వడానికి నిరాకరిస్తూ, "ఇది నాది" అన్నాడు.

హజ్రత్ అలి (రజి) అప్పుడు ఖలీఫాగా ఉన్నారు. ఆయన తలచుకుంటే తన కవచాన్ని ఆ యూదుడి నుండి బలవంతంగానైనా తీసుకోగలుగుతారు. కాని ఆయన అలా చేయడం భావ్యం కాదని భావించి ఆ వ్యవహారాన్ని న్యాయస్థానంలో పెట్టారు. న్యాయాధిపతి చట్టం ప్రకారం ఇద్దరు సాక్షులు కావాలన్నారు. హజ్రత్ అలి (రజి) తన పెద్ద కొడుకు హజ్రత్ హసన్ (రజి)ని, బానిస ఖన్బిర్‌ని సాక్షులుగా ప్రవేశపెట్టారు. అయితే న్యాయాధిపతి ఆ సాక్షులు స్వయంగా అలి (రజి) కొడుకు, బానిసలయినందున వారి సాక్ష్యాన్ని స్వీకరించడానికి నిరాకరించారు. పాపం! ఖలీఫా హజ్రత్ అలి (రజి) కవచం రాబట్టుకోవడానికి మరో మార్గం లేకపోవడం వల్ల దాన్ని వదలుకోవలసి వచ్చింది.

న్యాయాధిపతి యూదుడికి అనుకూలంగా తీర్పు ఇచ్చారు. ఈ తీర్పు విని యూదుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. అసలా కవచం హజ్రత్ అలి (రజి)దే అని యూదుడికి బాగా తెలుసు. సరైన సాక్ష్యం లేకపోవడం వల్ల హజ్రత్ అలి (రజి) తన కవచాన్ని కోల్పోవలసి వచ్చింది. న్యాయాధిపతి ఖలీఫాకు వ్యతిరేకంగా ఇచ్చిన ఈ తీర్పు ఆ

యూదుడ్ని ఎంతో ప్రభావితుడ్ని చేసింది. అతను వెంటనే, "అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడని, ముహమ్మద్ ఆయన ప్రవక్త అని నేను సాక్ష్యమిస్తున్నాన"ని చెప్పి ఇస్లాం స్వీకరించాడు. తరువాత ఆ కవచాన్ని హజ్రత్ అలి (రజి)కి అప్పగించాడు.

## ప్రతీకారానికి ఆయన ప్రతికూలం

ఒకసారి కొందరు బంధించబడి హజ్రత్ అలి (రజి) ముందు ప్రవేశపెట్టబడ్డారు. వారు హజ్రత్ అలి(రజి)ని బహిరంగంగా దూషిస్తూ ప్రజలలో ఆయనకు వ్యతిరేకంగా అసత్య ప్రచారం చేస్తుండేవారు. దీని వల్ల దేశంలో తిరుగుబాటు చెలరేగే ప్రమాదం ఉంది. అందుకే రక్షకభటులు ఈ అభియోగం మోపి వారిని బంధించి తెచ్చారు.

కాని హజ్రత్ అలి (రజి) వారికి శిక్ష విధించడానికి నిరాకరిస్తూ ఇలా అన్నారు: "వీరు క్రియాత్మకంగా ఏదైనా నేరం చేయనంతవరకు నేను వీరిని శిక్షించలేను. ఇక తిట్లు, దూషణల విషయానికి వస్తే, నేను వాటికి సమాధానాలివ్వను. కావాలనుకుంటే మీరే వీరి తిట్లకు సమాధానాలిచ్చుకోండి. కాని దుర్భాష, దూషణలు దేవునికి నచ్చవు. ఆయన తిట్టే వారిని అసహ్యించుకుంటాడు."

## శత్రువుల పట్ల సద్వర్తనం

తమవారి పట్ల అందరూ మంచిగానే మసలుకుంటారు. కాని పరాయివారి పట్ల, ముఖ్యంగా విరోధుల పట్ల సత్ప్రవర్తన కలిగి ఉండటమే చాలా కష్టమైన వ్యవహారం. హజ్రత్ అలి (రజి) మాత్రం తనవారు, పరాయివారు అని వివక్ష చూపకుండా అందరి పట్లా సత్ప్రవర్తన కలిగి ఉండేవారు. శత్రువుల పట్ల ఆయన ఎల్లప్పుడూ మంచిగానే ప్రవర్తించారు.

ఒక యుద్ధంలో హజ్రత్ అలి (రజి) శత్రువుతో పోరాడుతుంటే, శత్రువు క్రింద పడిపోయాడు. పడిపోగానే బట్టలు ఊడిపోయి అతను దిగంబరుడయిపోయాడు. అప్పుడు హజ్రత్ అలి (రజి) అతడ్ని హతమార్చే అవకాశం ఉన్నా దాన్ని వినియోగించుకోకుండా, అతను సిగ్గుపడిపోతాడని భావించి వెంటనే ఖడ్గం వెనక్కి లాక్కొని పక్కకు తొలగి నిలబడ్డారు.

జమల్ యుద్ధంలో హ॥జత్ అలి (రజి) పక్షానికి చెందిన ఇబ్నె జర్మూజ్ అనేవాడు హ॥జత్ ఆయెషా (రజి) పక్షంలో ఉన్న హ॥జత్ జుబైర్ (రజి)ని యుద్ధరంగం బయట సంహరించాడు. తరువాత బహుమానం దొరుకుతుందన్న ఆశతో ఆయన శిరస్సు, ఖడ్గం తీసుకొచ్చి హ॥జత్ అలి (రజి) ముందు పెట్టాడు. అయితే ఆ శిరస్సును చూడగానే హ॥జత్ అలి (రజి) ముఖం ఒక్కసారిగా కందగడ్డలా ఎఱ్ఱబారింది. ఆయన హ॥జత్ జుబైర్ (రజి) హంతకుడ్ని నానా మాటలు అంటూ, నువ్వు నరకానికి పోతావని శపించారు.

జమల్ యుద్ధం ముగిసిన వెంటనే ఆయన ఒక ప్రకటన చేస్తూ, ''పారిపోయేవారిని వెన్నాడకూడదు; గాయపడ్డవారిపైనుంచి గుఱ్ఱాలను పరుగెత్తించకూడదు; యుద్ధసొత్తును ముట్టుకోరాదు'' అని తన సైనికులకు ఆజ్ఞ జారీచేశారు.

హ॥జత్ అలి (రజి) చనిపోయే ముందు తన హంతకుడి నుంచి మామూలు ప్రతీకారం మాత్రమే తీసుకోవాలని చెప్పారు. విరోధుల పట్ల ఇంతకన్నా సద్వర్తనం మరెక్కడైనా కన్పిస్తుందా? దేవుడు ఆయన పట్ల ప్రసన్నుడవుగాక!

## సరైన సముచితమైన సలహాలు

హ॥జత్ అలి (రజి) ఎల్లప్పుడూ సరైన సముచితమైన సలహాలే ఇస్తుంటారు. ఆయన విషయాన్ని వివిధ కోణాల్లో క్షుణ్ణంగా ఆలోచించి సలహా ఇస్తారు. అనాలోచితంగా ఆయన ఎన్నడూ తన అభిప్రాయాన్ని వెలిబుచ్చేవారు కాదు. ఈ కారణంగానే దైవప్రవక్త (సఅసం) ప్రతి వ్యవహారంలోనూ హ॥జత్ అలి (రజి) సలహా తీసుకునే వారు. తాయిఫ్ యుద్ధం గురించయితే ఆయన (సఅసం) హ॥జత్ అలి (రజి)తో చాలా సేపు సుదీర్ఘంగా చర్చించి ఆయన సలహాలు తీసుకున్నారు.

హ॥జత్ అబూబకర్ (రజి), హ॥జత్ ఉమర్ (రజి) ఖలీఫాలుగా ఉన్నప్పుడు హ॥జత్ అలి (రజి)యే వారి ముఖ్య సలహాదారుడు. హ॥జత్ ఉమర్ (రజి) ఎలాంటి యుద్ధం గురించి అయినా అలి (రజి) సలహా తీసుకోకుండా ముందుకు సాగేవారు కాదు. ఆయనకు హ॥జత్ అలి (రజి) అభిప్రాయాలపై ఎంత నమ్మకం ఉండేదంటే, ఒక సందర్భంలో ఆయన, ''అలి గనక లేకపోతే ఉమర్ నాశనమవుతాడు'' అన్నారు.

హజ్రత్ ఉస్మాన్ (రజి) కూడా ఆయన దగ్గర సలహాలు తీసుకునేవారు. ముఖ్యంగా అల్లరిమూకలు అలజడి రేపినప్పుడు హజ్రత్ అలి (రజి) ఇచ్చిన సలహాలు ఆయనకు ఎంతో బలాన్ని చ్చాయి.

# ఆయన చేసిన ఘనకార్యాలు

హజ్రత్ అలి (రజి) ఖలీఫా అయిన వెంటనే ముస్లిం జగత్తులో విభేదాల అగ్నిపర్వతం ఒక్కసారిగా బ్రద్దలయింది. సమైక్యతా పూల హారం ముక్కలు ముక్కలయిపోయింది. హజ్రత్ అలి (రజి) తన సర్వస్వం ధారపోసి కృషిచేసినా వాటిని కలిపి ఒకటిగా చేయలేక పోయారు. కష్టాలు రోజురోజుకు ఇంకా పెరుగుతూనేపోయాయి. ముఠాతత్వం, వర్గవైషమ్యాలు భయంకరమైన అంటువ్యాధుల్లాంటివి. ప్రళయం దాకా అవి ఒక పట్టాన సమాజాన్ని వదలిపెట్టవు. హజ్రత్ ఉస్మాన్ (రజి) హత్య తరువాత హజ్రత్ హుజైఫా (రజి) అన్న మాట ముమ్మాటికీ నిజం. ఆయన ఎంతో ఆవేదన వ్యక్తపరుస్తూ, "అయ్యో! ఉస్మాన్ హత్య వల్ల ఇస్లాంలో ఏర్పడిన ఈ గుంట ఇక ప్రళయందాకా పూడదు" అన్నారు.

ఏమైనప్పటికీ ఈ అల్లర్లు, అలజడులు, యుద్ధాల మూలంగా హజ్రత్ అలి (రజి)కి దేశ సమస్యల్ని గురించి ప్రశాంత మనస్సుతో ఆలోచించడానికి, ఇస్లామీయ ప్రభుత్వాన్ని పటిష్ఠపరచడానికి అవ కాశమే లభించలేదు. అయినా ఆయన తన తాహతు మేరకు శక్తి వంచన లేకుండా కృషి చేశారు.

అలాంటి క్లిష్ట పరిస్థితుల్లో కూడా హజ్రత్ అలి (రజి) తన విధుల పట్ల ఏ మాత్రం ఏమరుపాటు వహించలేదు. పైగా ఆయన ధార్మికంగా, సామాజికంగా, విద్యాపరంగా సాటిలేని సేవలు చేశారు. వాటిని గురించి రాబోయే పుటలలో తెలుసుకుందాం.

# దేశ అంతర్గత వ్యవస్థ

హజ్రత్ అలి (రజి) దేశ అంతర్గత వ్యవస్థ విషయంలో పూర్తిగా హజ్రత్ ఉమర్ ఫారూఖ్ (రజి) అడుగుజాడలలో నడిచేందుకు కృషి

చేశారు. ఆ కాలంలో జరిగిన ఏర్పాట్లను ఆయన ఏ మాత్రం మార్చ దలచుకోలేదు. హజ్రత్ ఉమర్ (రజి) ఏ రంగంలో ఏ నీతిని, ఏ విధానాన్ని ప్రవేశపెట్టారో వాటిలో ఎలాంటి కొరత లేదని ఆయనకు పూర్తి నమ్మకం ఉండేది. అందుకే ఆయన వాటిని తగ్గించడంగాని, పెంచడంగాని చేయకుండా యధాతథంగా ఉంచారు.

హజ్రత్ ఉమర్ (రజి) హిజాజ్‌లోని యూదుల్ని వారి కుట్రలు, కుతంత్రాలతో విసిగిపోయి దేశం నుండి బహిష్కరించి నజ్రాన్‌కు పంపి వేశారు. హజ్రత్ అలి (రజి) పాలనాకాలంలో నజ్రాన్ నుంచి వారి ప్రతినిధి వర్గం వచ్చి హజ్రత్ అలి (రజి)ని పొగడ్తలతో ఆకాశానికి ఎత్తుతూ తమ పురాతన స్వస్థలానికి తిరిగి వచ్చేందుకు అనుమతి అడిగింది. కాని హజ్రత్ అలి (రజి) అందుకు నిరాకరిస్తూ ఇలా అన్నారు:

"నేను ఉమర్ (రజి) కంటే మంచి నిర్ణయం తీసుకునే వ్యక్తిని ఇంతవరకు చూడలేదు. ఆయన అన్ని విధాలా ఆలోచించి నిర్ణయానికి వస్తారు. ఆ తరువాతే దాన్ని అమలువరుస్తారు. అందువల్ల నేను ఆయన నిర్ణయాన్ని మార్చలేను."

యూదులు ఈ మాట విని కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయారు.

## గవర్నర్లపై పర్యవేక్షణ

ఏదైనా పాలనా విధానం ప్రవేశపెట్టే విషయంలో ముందుగా పాలనా విధానాలను నిర్వహించేవారిపై పర్యవేక్షణ ఉండవలసిన అవసరం ఉంది. ప్రభుత్వాధికారి (గవర్నర్) శ్రద్ధగా, కష్టపడి పని చేస్తు న్నాడా లేక తన ఇష్టమొచ్చినట్లు పని చేస్తున్నాడా అని చూడాలి. హజ్రత్ అలి (రజి) ఎవరినైనా గవర్నర్‌గా నియమించినప్పుడు అతనికి తగిన సూచనలు, హితవులు చేయడం చాలా అవసరమని భావించే వారు. దాంతోపాటు అప్పుడప్పుడు అతని పని తీరును గురించి కూడా పరిశీలన జరిపించేవారు. అంతేగాకుండా ప్రజల ఫిర్యాదులపై, గవర్నర్ల మితిమీరిన ఖర్చులపై కూడా ఆయన గట్టి నిఘా ఉంచే వారు.

ఒకసారి ఉర్ద్‌షైర్ గవర్నర్ ముస్లలా ప్రభుత్వ ధనాగారం నుంచి అప్పు తీసుకొని అయిదొందల మంది బానిసలను కొని వారికి స్వేచ్ఛ ప్రసాదించాడు. కొన్నాళ్ళ తరువాత హజ్రత్ అలి (రజి) అతను తీసుకున్న అప్పు సంగతి అడిగారు. దానికి ఆ గవర్నర్ జవాబిస్తూ, "దైవసాక్షి! ఉస్మాన్ (రజి) దృష్టిలో ఈ మాత్రం పైకం వదలేయడం పెద్ద విషయం కాదు. ఈయనేమో ఒక్కొక్క పైసా గురించి లెక్క అడుగుతున్నారు"అని అన్నాడు. ఈ మాట చెప్పిన తరువాత అతను అమీర్ మావియా (రజి) దగ్గరికెళ్ళి ఆశ్రయం పొందాడు.

మరొకసారి బస్రా గవర్నర్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి) ప్రభుత్వ ధనాగారం నుంచి ఓ పెద్ద మొత్తం తీసుకున్నాడు. దానిపై హజ్రత్ అలి(రజి) ఆక్షేపణ తెలిపారు. దానికా గవర్నర్, "నేనింకా నా హక్కును పూర్తిగా తీసుకోనేలేదు"అన్నాడు. అతనలాసమాధానమయితే ఇచ్చాడు గాని, ఖలీఫా తీసుకునే చర్య గురించి భయపడి బస్రా వదలి మక్కా వెళ్ళిపోయాడు.

## పన్నుల శాఖ

హజ్రత్ అలి (రజి)కు పూర్వం అడవుల ద్వారా ప్రభుత్వం ఎలాంటి ప్రయోజనం పొందేదికాదు. హజ్రత్ అలి (రజి) ఖలీఫా అయిన తరువాత అడవుల మీద కూడా పన్ను విధించారు.

హజ్రత్ ఉమర్ (రజి) తన పాలనాకాలంలో గుజ్జాల వ్యాపారం జరుగుతున్నందున గుజ్జాలపై కూడ జకాత్ విధించారు. అయితే హజ్రత్ అలి (రజి) గుజ్జాల సంతతిని అభివృద్ధిపరచడం వల్ల ఎన్నో ప్రజావసరాలు, యుద్ధప్రయోజనాలు నెరవేరుతాయని భావిం చారు. అందువల్ల ఆయన గుజ్జాల మీద విధించబడిన జకాత్‌ను తీసేశారు.

పన్నులు వసూలు చేయడంలో హజ్రత్ అలి (రజి) కాస్త కఠినంగానే వ్యవహరించేవారు. అయితే బలహీనులు, నిరుపేదల పట్ల మాత్రం ఆయన కఠినంగా వ్యవహరించేవారు కాదు. పైగా ఆయన వారిని ఆదుకునేవారు. వారి అవసరాలను గమనిస్తూ తగిన సహాయం అందజేస్తుండేవారు.

## ప్రజల పట్ల ప్రేమాభిమానాలు

హజ్రత్ అలి (రజి) ప్రజల పట్ల ఎంతో ప్రేమాభిమానాలు కలిగి ఉండేవారు. పేదప్రజల కోసం ప్రభుత్వ ధనాగారం ఎల్లప్పుడూ తెరిచే ఉండేది. అందులో జమ అయ్యే ధనాన్ని ఆయన ఎప్పటికప్పుడు పేదలకు అందజేస్తుండేవారు.

ఈరాన్‌లో నిరంతరం కుట్రలు, తిరుగుబాటులు జరుగుతున్నా హజ్రత్ అలి (రజి) అక్కడి ప్రజల పట్ల కూడా దయ, సానుభూతులతో ప్రవర్తించేవారు. చివరికి ఈరాన్ ప్రజలు హజ్రత్ అలి (రజి) సత్ప్రవర్తన పట్ల ఎంతో ప్రభావితులయి, ఆయన్ని ఈ విధంగా ప్రశంసించేవారు:

"దైవసాక్షి! ఈ అరబ్బు పాలకుడు నౌషేర్వాన్ ఆదిల్‌ని తలపింపజేస్తున్నాడు."

## ధార్మిక సేవలు

హజ్రత్ అలి (రజి) పాలనాకాలమంతా అంతర్ యుద్ధాలతో నిండిపోయింది. ఈ కారణంగా హజ్రత్ అలి (రజి)కి ఇతర పనులు చేయడానికి అవకాశమే లభించేది కాదు. అయినప్పటికీ ఆయన తన విధ్యుక్త ధర్మాన్ని మరచిపోలేదు.

ఈరాన్, ఆర్మేనియాలలో నవముస్లింలు ఇస్లాం ధర్మం వదలి మళ్ళీ తమ పాత క్రైస్తవ మతంలోకి వెళ్తున్నామని ప్రకటించినప్పుడు హజ్రత్ అలి (రజి) చేతులు ముడుచుకొని కూర్చోలేదు. తక్షణమే ఆయన ఆ వ్యవహారంపై దృష్టి కేంద్రీకరించి తగిన చర్యలు తీసుకున్నారు. తత్ఫలితంగా వారిలో చాలామంది తమ తప్పు తెలుసుకొని పశ్చాత్తాపం చెంది తిరిగి ఇస్లాం స్వీకరించారు.

ఖార్జీలు సృష్టించిన అలజడులు, ఉపద్రవాలను కూడా అంత మొందించడానికి హజ్రత్ అలి (రజి) శక్తివంచనలేకుండా కృషిచేశారు. మరో వైపు తనను సాక్షాత్తు దేవుడని బాహాటంగా చెబుతూ తిరుగుతున్న సబాయీ వర్గం వీరాభిమానుల్ని కూడా ఆయన కఠినంగా శిక్షించారు.

హజ్రత్ అలి (రజి) ప్రజలలో పెరుగుతున్న దుర్నడత, శీల రాహిత్యాలను కూడా నిర్లక్ష్యం చేయలేదు. నేరాలను బట్టి ఆయన కొత్త కొత్త శిక్షలను ప్రవేశపెట్టారు. మద్యసేవనం నేరానికి విధించే కొరడా శిక్షలో కొరడాల సంఖ్య నిర్ణయం కాలేదు. హజ్రత్ అలి (రజి) ఈ నేరానికి ఎనభై కొరడా దెబ్బలను నిర్ణయించారు. ఎవరైనా ఫలానా నేరం చేస్తానని అన్నంత మాత్రాన అలాంటి వ్యక్తికి ఆయన శిక్ష విధించేవారు కాదు. ఓసారి ఒకతను ఒక ఇంటికి కన్నం వేశాడు. అయితే దొంగతనం చేయకముందే అతను పట్టుబడ్డాడు. కాని హజ్రత్ అలి (రజి) అతనికి ఎలాంటి శిక్ష విధించలేదు.

## విద్యాసేవలు

హజ్రత్ అలి (రజి) మంచి వాగ్ధాటిగల వక్త. ఎలాంటి ధార్మిక సమస్యలనయినా పెద్ద పెద్ద సమావేశాల్లో సైతం ఆయన అనర్గళంగా ఉపన్యసించి ప్రజలను ఇట్టే ఆకట్టుకునేవారు. ఆయన ఉపన్యాసం పరవళ్ళు తొక్కే జలపాతంలా, గలగల పారే సెలయేరులా సాగుతూ నిద్రమత్తులో జోగుతుండేవారిని వెన్నుతట్టి లేవుతుంది; క్రుంగిన హృదయాలను సయితం ఉత్తేజపరుస్తుంది. యుద్ధరంగంలో ఆయన సైనికుల ముందు నిలబడి ప్రసంగిస్తుంటే, సైనికులు వీరావేశంతో ఊగిపోయేవారు. తరువాత యుద్ధరంగంలో తుఫానులా విరుచుకు పడి, శత్రువులు బిత్తరపోయి పారిపోయేలా అసాధారణ పరాక్రమంతో పోరాడేవారు.

అరబీ భాషలో "నహూ" అనేది ఒక ప్రత్యేక వ్యాకరణ శాస్త్రం. దాన్ని మొట్టమొదట హజ్రత్ అలి (రజి)యే ప్రవేశపెట్టారు. ఒకసారి ఆయన ఒకతను దివ్యఖుర్ఆన్ తప్పుగా పఠించడం గమనించారు. అప్పుడాయన ఖుర్ఆన్ పఠనంలో తప్పులు జరగకుండా ఉండేలా ఒక పద్ధతి నిర్ణయిస్తే బాగుంటుందని తలపోశారు. దాంతో ఆయన అబుల్ అస్వద్‌కు కొన్ని మౌలిక విషయాలు తెలిపి మిగిలిన సూత్రాలతో 'నహూ' శాస్త్రం తయారుచేయమని చెప్పారు. ఆ విధంగా "నహూ" శాస్త్రం ఉనికిలోకి వచ్చింది.

హజ్రత్ అలి (రజి) మంచి కవి కూడా. కాని కవిత్వం మీద ఆయన ఎలాంటి ఆసక్తి చూపలేదు.

## మరణశాసనం

హజ్రత్ అలి (రజి) తన మరణ సమయం సమీపించినప్పుడు కొడుకులు హసన్(రజి), హుసైన్(రజి), ముహమ్మద్ బిన్ హనఫియా (రహ్మాలై)లను పిలిపించి కొన్ని హితోపదేశాలు చేశారు. మొదట హుసైన్ (రజి)ని సంబోధిస్తూ ఇలా చెప్పారు:

"బాబూ! నీవు ఎల్లప్పుడూ దేవునికి భయపడుతూ ఉండాలి. ప్రాపంచిక వ్యామోహంలో పడిపోకు. నీకేదయినా లభించకపోతే దాన్ని గురించి విచారించకు. ఎల్లప్పుడూ న్యాయమైన మాటనే పలకాలి. అనాథలను కనికరిస్తూ ఉండు. ఏ ఆధారమూ లేనివారికి సహాయ పడు. దౌర్జన్యపరులకు విరోధిగా, పీడితులకు సహాయకునిగా ఉండాలి. దివ్యఖుర్ఆన్ ప్రకారం ఆచరిస్తూ ఉండు. దైవాజ్ఞలను పాటిస్తున్న కారణంగా ఎవరైనా నిన్ను నిందిస్తే వారి నిందలకు భయపడకూడదు."

తరువాత ఆయన ముహమ్మద్ బిన్ హనఫియాకు ఇలా ఉప దేశించారు: "నేను నీకు కూడా ఈ విషయాలను గురించే ఉప దేశిస్తున్నాను. పోతే ఇద్దరు అన్నయ్యల పట్ల గౌరవభావంతో వ్యవహ రించాలి. వారి అభిమతానికి వ్యతిరేకంగా ఏదీ చేయకూడదు."

ఆ తరువాత హుసైన్ (రజి) వైపు తిరిగి, "నువ్వు కూడా ముహ మ్మద్ బిన్ హనఫియా పట్ల ప్రేమాభిమానాలతో మసలుకోవాలి" అని చెప్పారు.

ఆ తరువాత సాధారణ మరణ శాసనాన్ని వ్రాయించారు. మృత్యువు సమీపించింది. ఇక 'లా ఇలాహ ఇల్లల్లాహు' తప్ప మరో మాట ఆయన నోట వెలువడలేదు.

## ఆయన సమాధి

హ్రజత్ అలి (రజి) సమాధి గురించి విభిన్న ఉల్లేఖనాలు ఉన్నాయి. కాని ఈనాటి వరకూ ఆయన సమాధి ఎక్కడుందో ఇదమిత్థంగా తేలలేదు. కొన్ని ఉల్లేఖనాల ప్రకారం ఆయన సమాధి కూఫా మసీదులో ఉందని తెలుస్తోంది. కొన్ని ఉల్లేఖనాలు ఆయన ఇంట్లోనే ఉందని చెబుతున్నాయి. మరికొన్ని ఉల్లేఖనాలు, కూఫా పట్నం నుంచి పది మైళ్ళ దూరంలో ఉందని తెలుపుతున్నాయి. ఇంకొన్ని ఉల్లేఖనాల ప్రకారం, ఖార్జీలు, అలి (రజి) భౌతికకాయాన్ని అగౌరవపరుస్తారన్న భయంతో హ్రజత్ హసన్ (రజి) దాన్ని తీసి రహస్యంగా ఎక్కడో ఖననం చేశారని తెలుస్తోంది. వేరొక ఉల్లేఖనంలో, శవపేటికను ఒంటె మీద పెట్టి మదీనాకు తీసుకొని వెళ్తుంటే దారిలో తప్పించుకొని ఎక్కడికో పారిపోయిందని, ఎంత వెతికినా ఆ ఒంటె జాడ తెలియలేదని ఉంది. మరొక ఉల్లేఖనంలో, ఆ ఒంటె తయ్యి ప్రాంతంలో దొరికిందని, ఆయన భౌతికకాయాన్ని అక్కడే ఖననం చేశారని ఉంది.

ఏది ఏమైనా ఖార్జీల భయం వల్ల ఆయన భౌతికకాయాన్ని ఎవరికీ తెలియని ప్రదేశంలో ఖననం చేశారని తెలుస్తోంది.

## ఆయన ప్రత్యేకతలు

- బాలల్లో హ్రజత్ అలి (రజి) అందరికంటే ముందు ఇస్లాం స్వీకరించారు.
- ఆయన బాల్యంలో కూడా ఎన్నడూ విగ్రహాలను పూజించలేదు.
- దైవప్రవక్త (సఅసం) మదీనా వలసపోయేనాటి రాత్రిన హ్రజత్ అలి (రజి)ని తన పడకపై పడుకోబెట్టారు.
- తబూక్ యుద్ధంలో తప్ప ఆయన ప్రతి యుద్ధంలోనూ పాల్గొన్నారు.
- ఉహుద్ యుద్ధంలో ఆయనకు పదహారు గాయాలయ్యాయి.

- దైవప్రవక్త (సఅసం) ఆయన్ని తన కుటుంబంలో ఒక సభ్యునిగా చేర్చుకున్నారు.
- ఆయన బనీహాషిం వంశంలో మొట్టమొదటి ఖలీఫా.
- దైవప్రవక్త (సఅసం) ఆయన్ని ప్రపంచంలోనూ, పరలోకంలోనూ తనకు సోదరునిగా చేసుకున్నారు.
- ఆయన విషయంలో దైవప్రవక్త (సఅసం), "నేను జ్ఞాన పట్టణాన్ని. అలి (రజి) దాని ద్వారం" అన్నారు.
- ఆయనకు బరాత్ (తౌబా) సూరా ప్రచార బాధ్యత అప్పగించబడింది.
- ఆయన ద్వారానే యమన్‌లో ఇస్లాం వెలుగు ప్రసరించింది. దేవుడు ఆయన పట్ల ప్రసన్నుడవుగాక!

## ఆయన హితోక్తులు

- జ్ఞానం ఆర్జించి దాని ప్రకారం ఆచరించేవాడే పండితుడు.
- బుద్ధివివేచనలే అన్నింటికంటే గొప్ప భాగ్యం.
- బుద్ధిహీనతే అన్నింటి కంటే పెద్ద దారిద్ర్యం.
- మూర్ఖుడితో కలసి ఉండకండి.
- పాపానికి తప్ప మరిదేనికీ భయపడకూడదు.
- దేవుని మీద తప్ప మరెవరిపై ఆశలు పెట్టుకోకూడదు.
- తనకు తెలియని విషయం నేర్చుకోవడానికి మనిషి సిగ్గుపడకూడదు.
- కష్టాలను రహస్యంగా ఉంచడం ఎంతో సాహసకార్యం.
- నమ్మకం వల్లనే మనసు ప్రశాంతంగా ఉంటుంది.
- తనను గురించి తాను తెలుసుకున్నవాడు తన ప్రభువుని గురించి తెలుసుకున్నట్లే.
- ఉపకారం మనిషి నోటిని కట్టివేస్తుంది.
- తియ్యని పలుకులు ఇతరులను సోదరునిగా చేస్తాయి.

- బుద్ధిహీనుడు ఎల్లప్పుడూ ఇతరుల మీద ఆధారపడతాడు.
- అత్యాశ మనిషిని నీచుడిగా చేస్తుంది.
- జ్ఞానం అధముడ్ని అధికుడిగా చేస్తుంది.
- విజ్ఞతకు మించిన మహాభాగ్యం లేదు.
- సదాచరణకు మించిన మంచి వ్యాపారం మరేదీ లేదు.
- చేసిన పాపం పట్ల సిగ్గుపడితే అది ఆ పాపాన్ని ప్రక్షాళనం చేస్తుంది.
- ఇతరుల మీద అపనింద మోపడం ఆకాశం కంటే భారమైన పాపం.
- శత్రువునుండయినా సరే, బుద్ధీవివేచనలు సంపాదించండి.
- ఏమరుపాటు పర్యవసానం, సిగ్గుతో తలదించుకోవడమే.
- ఇతరుల తప్పులు ఎన్నడమే అన్నింటికంటే పెద్ద తప్పు.
- గర్వం ప్రగతిని నిరోధిస్తుంది.
- అసూయాపరుడికి ఏనాడూ శాంతీ సంతృప్తులు లభించవు.
- చెప్పేవాడి మాటేమిటో ముందు శ్రద్ధగా ఆలకించు.
- ఎక్కువ విజ్ఞతగలవాడు తక్కువ మాటలు కల్పిస్తాడు.
- కేవలం అనుమానం కారణంగా సత్సంబంధాలను తెంచుకోరాదు.
- హద్దుమీరిన యుక్తిపరుడు పరాక్రమశాలి కాలేడు.
- మనిషికి ఔన్నత్యం విజ్ఞత, సభ్యతల వల్ల లభిస్తుంది కాని, కుటుంబం, వంశాల వల్ల లభించదు.

చూశారా! హజ్రత్ అలి (రజి) ఎన్ని మంచి ఉపదేశాలు ఇచ్చారో. దేవుడు మనకు వాటిని ఆచరించే సద్బుద్ధి ప్రసాదించుగాక! తథాస్తు.

